

క్రొత్తల్లుడు

చిత్రకారుడు: పి. రామకృష్ణ గారు.

చందమామను గనుటెంత సంబరంబొ
సలిల కలశంబు చెప్పఁగాఁ జాలకున్నఁ
బొడఁగనిన మాత్ర ముప్పొంగి పోవుచుండు
కలశవారాశిఁ గనియైనఁ దెలిసికొనుఁడు.

—కావ్యకుసుమావళి.




# పురుష నర్సులు

మద్రాసు స్టాన్లీ మెడికలు కాలేజిలో ఆరోగ్యశాఖామంత్రి గౌ. రాజనుగారి చిత్రపటాన్ని బహిరంగపరుస్తూ, అడ్వకేటు జనరలు శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారు మంత్రిగారి ఘనతనుగూర్చి ఉపన్యసించినారు. వారతి సాహసముతో ఆరోగ్యశాఖలో గావించుతూఉన్న కృషిని శ్లాఘించినారు. కాని మంత్రిగారిటీవలనే ప్రవేశపెట్టిన పురుష నర్సుల పద్ధతినిగురించి ప్రసంగిస్తూ, 'మంత్రిగారే ఉద్దేశముతో 'మగనర్సుల' పద్ధతిని ప్రవేశపెట్టినారోగాని, ఎంత ప్రవీణులైన పురుషనర్సులున్నా నేననారోగ్యముగా ఉన్నపుడు ఉపచర్య చేయడానికి మా తల్లిగారినే అంగీకరిస్తాను" అన్నారు.

అల్లాడివారికేగాదు, అఖిలప్రపంచానికంతా అల్లాడివారి హృదయమూ, ఉద్దేశమూ ఉన్నట్టు కనబడుతుంది యీ విషయములో. అందుచేతనే అందరు మాతృమూర్తిని - స్త్రీమూర్తిని - అనారోగ్యకాలమున ఉపచరించడానికి ఉద్యోగరీత్యా నర్సులనుగా తయారుచేసినారు. శాంతితో, ఓపికతో, ఆదరణతో, కరుణతో, రోగబాధితులకారోగ్యానందాలు కలిగేటట్టు ఉపచరించగల ఉన్నతశక్తి ప్రకృతిసిద్ధముగా స్త్రీలో మూర్తీభవించినదని లోకమే అంగీకరించినది. ఎంత ఉదారుడైనా, ఉన్నతగుణాలు కలవాడైనా, పురుషుని కట్టి ప్రకృతి అలవడుతుందని అనుకొనడానికి ఆధారాలు లేవు.

అయినా అకస్మాత్తుగా కాంగ్రెసు ప్రభుత్వములో స్త్రీ ప్రకృతిని పురుషుడుకూడా పొందకలిగినాడు మరి !

అక్టోబరు 27వ తేది ప్రభుత్వాజ్ఞ ప్రకటితమయింది—నర్సింగ్ డిపార్టుమెంటులో పురుషులు కూడా చేర్చుకొనబడతారని. ఇపుడున్నది ప్రజాప్రభుత్వం గనుక ప్రపంచంలో ఆదరణపొందని పద్ధతులను ప్రవేశపెట్టేటపుడు ప్రజాభిప్రాయం కనుగొనవలెను. పోనీ ఇది వారికేమి తెలుస్తుందని ప్రభుత్వం అనుకునేపట్ల ఆవిషయాన్ని బాగా ఎఱిగిన ప్రవీణులనైనా సంప్రతించివుంటే బాగుండేది. ఇదేమీ చేసినట్టే కనబడదు. సంప్రతింపే జరిగివుంటే వైద్యప్రపంచాభివృద్ధిని, రోగుల మేలునూ కోరేవారెవరూ ఇటువంటి పద్ధతుల నంగీకరించి వుండరు. అందుకే ఇది ప్రకృతివిరుద్ధమూ, శాస్త్రవిరుద్ధమూ, లోక విరుద్ధమూ అయింది.

ఇకమీఁదట హాస్పిటలులోని రోగులకు పురుష స్త్రీ నర్సు లిద్దరూ ఉపచరిస్తారు. పిల్లలను స్త్రీలను స్త్రీ నర్సులు చూచుకుంటారు. పురుషులకు పురుషనర్సులు ఉపచరిస్తారు—ఇంతవఱకు 'నర్సు' అంటే స్త్రీ పరముగానే వాడే వారము. ఇపుడా స్థానములోనికి పురుషులుకూడా ప్రవేశించినారు కాబట్టి భేదము తెలుపడానికి నర్సు పదానికి ముందు స్త్రీయని, పురుషుడని చేర్చవలసి వచ్చింది ! మంత్రిగారు ఉపచారకవర్గములో చేరబోయేపురుషులకు వేరుపేరైనా సృష్టించివుంటే బాగుండేది–ఈ పద్ధతి చిత్రవిచిత్రాలకు పుట్టయిన భారతీయుల బుద్ధివిశేషాని కొక నిదర్శనము.

ఈ పద్ధతివలన పురుషుల కుపచరింపవలసిన కష్టము స్త్రీలకు తొలగిపోతుందని మంత్రిగారంటారు. అయితే నర్సుసంఘాలు మాత్రము యీ ప్రభుత్వశాసనము అన్నివిధాలా తమ అభివృద్ధి కాటంకముగా వుందని గోలచేస్తూవున్నారు. మంత్రిగారి మాటలలో వారికి గౌరవము లేనట్టుంది.

మంత్రిగారి మాటలను గౌరవించి మగనర్సులవల్ల రోగులకు కలిగే మహాదానం దాన్ని జుఱ్ఱుకొందామన్నా ఎన్నో సందేహాలు కలుగుతాయి. నర్సుల శిక్షణ కంగీకరింపబడే వారంతా 18-22. సం. రాలకు లోబడిన యువక ప్రపంచము. నిరుద్యోగభూతాని కెరయినవారే ఇందులో ఎక్కువ చేరుతారు. తక్కినవారు వినోదానికి చేరవచ్చు. ఎవరి అధీనములోనున్నా, వారేస్థితిలో వున్నా, పై వయస్సు వారికెంత శాంతి, ఓపిక, విచక్షణ, ఉపచరణ బుద్ధి ఇస్తుందో ప్రపంచానుభవం గల అందరికీ తెలుసు—అందులోనా జీతాలు తక్కువైనపుడు, కఠిన నియమాలకు లోనై విడువకుండా ప్రతిదినమూ పన్నెండు గంటల కాలము పనిచేయవలసి వచ్చినపుడు !

ఈవయస్సేకల యువతులకు మాత్రం పైగుణాలెలా కలుగుతాయని ఎవరూ ప్రశ్నించరు. ఎందుకంటే పదిహేను సంవత్సరాల యువతి రెండింతలు వయస్సుగల భర్తతో సంసారంచేస్తూ, కుటుంబ విషయా

లన్నింటినీ నిర్వహించుకొనడం లేదూ? అందుకే చెప్పడము, వారికాశక్తి ప్రకృతి సిద్ధమని.

ఇది పురుషుల నిరుద్యోగతను కొంత వఱకు తగ్గిస్తుందేమోగాని స్త్రీలకున్న అవకాశాన్నికూడా దోచుకుంటూ వుంది. వారికెక్కువ అవకాశమున్నవీ, వారు జయప్రదంగా పనిచేయ గలిగేవీ—ఇప్పటికి— వైద్య, విద్యాశాఖలు రెండే. ఒకశాఖలో అవకాశము తగ్గించితే ఇ తర శా ఖ ల లో కూడా వారికి పురుషులతో సమానావకాశము లిస్తారా మంత్రులు?

ఈ నూతన పద్ధతి ప్రకారము ఇకమీదట నర్సుల నెల జీతాలు తగ్గింపబడ్డాయి— అంటే వార్డుసిస్టరుకు రు. 157-10 నుండి రు. 62-10 కు, స్టాఫ్ నర్సుకు రు. 93-14 నుండి రు. 42-10 కు, తగ్గించినారు. శిక్షణ కాలములో నర్సులకు సగటున నెలకు 27 రు. చేసినారు. ఇదివఱకు వున్న జీతాన్ని బట్టి చూస్తే వారికి శిక్షణ కాలములో మొదటి సంవత్సరము, నెలకు రు. 21-14, రెండో ఏడు రు. 31-14, మూడో ఏడు రు. 41-14 నష్టము.

ఇపుడు సాధారణ నర్సులకు ఇస్తూవున్న జీతాలు ఎక్కువనడానికి వీలులేదు. ఎందుకంటె వారుచేసేపని ఎటువంటిది? అది దినానికెన్ని గంటలు? సహజముగా దయా దాక్షిణ్యాలు, శాంతిక్షమలు వున్నవారు కూడా అసహ్యించుకునే పనులను సంతోషముగా చేసి నర్సులు రోగుల కుపచరిస్తారు. వారు మెలగేది కఠిన నియమాల్కింద, పనిచేసేది విరామము లేకుండా పన్నెండు గంటలు. ఇంతకాలము విసుగకుండా ఇలాంటి పని చేయడం మరియే యితరశాఖలోనైనా వుందా? చేస్తున్నదానికి తగిన జీతాలైనా వద్దూ? ఇంత అవస్థపడుతూ వారు ధనాభావముచేతకూడా బాధపడాలంటే తరువాత రోగులగతి యేమిగావలెను?

వారింకేమైనా పైగా సంపాదించుకొనాలని రోగులను పీల్చి పిప్పిచేస్తే? నానా రోగాలతో బాధపడుతూ హాస్పిటల్సు చేరే రోగులకికమీదట యీ బాధ కూడా పడవలసివస్తే—శాంతం పాపం.

తమకు సంబంధములేని విషయాలలో 'లంచా లివ్వకండి' అని ఉపన్యాసా లివ్వవచ్చుగాని నానారోగాలతో హాస్పిటల్సు చేరి డాక్టర్ల ఔషధాలకంటె నర్సుల ఉపచారమే ఎక్కువ ఆవశ్యకముగా గావలసివుండే రోగుల కెంతవఱకు ఈ సూత్రం ఉపకరిస్తుందో, 'లంచాలివ్వకూడద'నే నియమాన్నే అక్కడఆచరణలో పెట్ట ప్రయత్నించినవారి గతి ఏమయిందో, ఏమవుతూందో, ఏమి కాబోతుందో హాస్పిటల్సు చూడని వారికి తెలియదు! ఇక నర్సులకు జీతాలు కూడా తగ్గించితే?

సంతానములేని వితంతువులు— థర్డు ఫారము పాసయి, 22 సంవత్సరములకు మించకవుంటే—ఇకమీదట నర్సుల శిక్షణకు ప్రథమయోగ్యులుగా అంగీకరింపబడుతారు. ఇది శ్లాఘనీయమే.

అయితే సంతానవతులుగా వుండేవారి మాటేమిటి ? దిక్కూ మొక్కూ లేక పిల్లల సంరక్షణార్థమే, వారు నర్సుల శిక్షణ ప్రవేశింపవచ్చు— ఇందవకాశముంది గను క. అలాంటివారికీ నిషేధమెంత అశాభంగము!

చంటి పిల్లలతోనున్న వితంతువులకు యీ శిక్షణార్హతలేకుండ చేయవచ్చును గాని పదేసిమిదేండ్ల వయసుగల బిడ్డలున్న వారికాటంక ముండకూడదు.

శిక్షణకాలములో, ఉద్యోగములో నున్నపుడు వారి బిడ్డలు వేరుగానుండుటకు కావలసిన ఏర్పాట్లు వారే చేసుకుంటారు. ప్రభుత్వ నియమము ప్రకారము ఆ కొన్ని సంవత్సరాలు ఉద్యోగముచేసి తరువాత విరమించుకొని స్వగ్రామాలకు వెళ్లి శిక్షణ సహాయముతో కుటుంబ సంరక్షణ చేసికొనవచ్చును. కాబట్టి సంతానమున్న వితంతువులకు కూడా శిక్షణకర్హతను కల్పించవలెననిమావుద్దేశము.

# దీపాలు

శ్రీ దువ్వూరి సూర్యనారాయణమూర్తిగారు

"వెలిగించవే తల్లి! వెలిగించవే;
పసిడివెలుగుల జ్యోతివెలిగించవే"

౧
ఏటి తరగలపైన
ఈదులాడుచుపోయి
కలకలా నవ్వుచును
మిలమిలా మెరయగను ॥వె॥

౨
వెండి వెన్నలమిసిమి
వెగటుగా తినియుమిసి
కృత్తికలు తెలిసీట
కులుకుచూ నినుచూడ ॥వె॥

౩
కార్తీక చంద్రికలు
కరిగి వెలవెలబార
పాటల జ్యోత్స్నలే
పారువేకువ వేళ ॥వె॥

౪
పసుపు పూసినసీదు
బంగారు మోముపై
పరుగులిడు తరళతర
భవ్యరుచి కళికలటు ॥వె॥

౫
నీదుసౌభాగ్య సౌవర్ణ వర్ణములట్లు
నీచిరంతన ధర్మనిరతి బీజములట్లు
నీదుతొలినోము రత్నాల పంటన్నట్టు
కార్తికము కోటికన్నులు విచ్చినినుచూడ ॥వె॥

# స్త్రీ—ధర్మం

శ్రీమతి వల్లభనేని రంగాదేవిగారు

మహిళోన్నతియందే మానవసంఘోన్నతి మిళితమైయున్నది. మహిళోన్నతి కాగనే గృహము స్వర్గమయమగును. మహిళోన్నతే మానవసంఘమునకు నూతనత్వం. అంటే సంపూర్ణత్వ మందినదన్నమాట. స్త్రీజాతి వున్నతిజెందిననాడే యీదేశం కల్యాణమయమగును. ఎందువల్లనంటే మానవ సంఘానికి రెండంగాలు. ఒకటి పురుషులు. రెండు స్త్రీలు. యీ యిరువురి జీవితం కలస్తేనే సాంఘిక జీవితమగుచున్నది. యీ రెంటిలో నొక యంగమును నిర్లక్ష్యంగా జూచినయెడల సంఘానికి పక్షాఘాతం కల్గుతుంది. రెండంగాలనూ ఒకేమాదిరిగా వికసించులాగ జూచినయెడల నేడు స్త్రీసమస్య యీవిధంగా ఆందోళన కాకరముగాదు. నేడు మహిళోద్ధరణ నారీజనోద్ధరణ అంటూ స్వతంత్రంగా చర్చలు సాగుచున్నవి. దీనికి కారణం వర్తమాన సాంఘిక దురవస్థ, సాంఘికజీవితమూ, పారివారికజీవితమూ అసహ్యముగాయుండబట్టే నేడు స్త్రీ సంఘాలు యీవిధంగా పోరాడుట సంభవించినది. గృహజీవితములోనూ, సాంఘిక జీవితములోనూ ప్రేమోన్నతైక్యము రావాలి. అదే గనకవస్తే యీ సమన్వయ న్యాయానికై యింత యాలోచనే అవుసరంలేదు. సమత్వం—యిది ఆదర్శంగా నక్కరలేదు. స్వాభావికపరిణామంగా, ప్రేమ, ఐక్యము వున్నచోట యీ విషమస్థితి నామరూపాలేవుండవు.

కాని నేడు సాంఘికావస్థ విషమస్థితియందున్నది. స్త్రీలు పరాధీనులై, ఆశ్రితులై, అజ్ఞానదశలోయున్నారు. పురుషులకంటే సంస్కరించబడినప్పటికీ స్త్రీలు తేజోవంతముగలేరు. స్త్రీస్వభావము కోమలముగను, ప్రేమమయముగను, అహింసాన్వితముగను వుండును. స్త్రీలు వీటిని వికసింపజేసారు. హింస, అడవిమనుష్యుల కృత్యమూ, అహింసావృత్తి సంస్కారలక్షణమూ అయితే స్త్రీలే సంస్కారవతులు ఉద్ధరింపపడినవారు. స్వచ్ఛందముకన్న సంయమమే శ్రేష్ఠమైన భారతదేశమున స్త్రీవర్గమే యున్నతస్థాన మాక్రమించెను. స్వార్థాన్ని జంపి పరోపకారానికే ప్రాధాన్యమిస్తే కౌటుంబికజీవితంలో అంగనదే యగ్రస్థానం. స్త్రీకి చెడుదశయేమన పరావలంబనము. స్త్రీ స్వాతంత్రురాలైతే సమస్త సద్గుణములతో గూడిన హృదయోన్నతి యొక్కసారిగా ప్రజ్వలిస్తుంది. అంటే స్త్రీలుకూడా పురుషుల్లాగ జీవననిర్వహణాచింతలో పడమని నా కోర్కెగాదు. నాదృష్టిలో పురుషులకంటే స్త్రీజనసేవయే శ్రేష్టమైనది.

సంఘము మారాలంటే మానవస్వభావంలో పరివర్తన రావాలి. న్యాయత్రాసు స్వార్థవైషమ్యాలను దూరంజేసి శాంతి

స్థాపనచేయాలి. కాని "ధర్మం" అంటే న్యాయంకాదు "దయ". యీ దయాధారమునసే సంఘరచనకు పూనుకోవాలి. హత్యకు ప్రతిహత్యచేయుటే న్యాయం. కాని హత్యలు పెరిగినవిగాని, న్యాయం జరిగినట్లెక్కడా తోచదు. న్యాయాన్ని సాధించునది వీరులు. క్షమాశీల యాచరణకు యోధులకంటే యుచ్ఛకోటికి జెందిన వీరు లావశ్యం. ఆ వీరత్వ మొకరు జెప్పగలది గాదు. ఎవరి చేతులు హత్యలతో నపవిత్రము గాకున్నవో, ఎవరు వినయంగా తమ వున్నతపథమును పొందిరో, ఎవరు సేవామార్గమున స్వార్థత్యాగులైరో, ఆ నారీసమాజం యీ క్షమాశీలమును సాధించగలదు. సంఘోద్ధరణ యేనాటికైనా స్త్రీల వల్లనే కావాలి. అహింసా ధర్మార్థముల గ్రహించగలుగునది స్త్రీలు. స్త్రీలే దానిని పాలించునది, ప్రచారముజేయునది. అహింసావ్రతధారణ కవసరమగు గుణములు స్త్రీలయందున్నవి. కాని దాని కావశ్యకమగు జ్ఞానం కొంత నేర్చుకోవాలి. స్త్రీలయం దహింసయున్నది. కాని అది స్వాశ్రయులై, నిర్భయులై మెలంగునప్పుడే ప్రకాశించును. మే మబలల మనుమాట స్త్రీలయం దంతరించాలి. సంఘ మెదుట గడ్డకట్టియున్న గడ్డుప్రశ్నల కుత్తరవిూయ తయారై యుండాలి.

సంఘోద్ధరణ ధర్మంవల్లనే గాని జరుగదని యెల్లరకూ విదితమే. కాని సంఘ మెదుట శుద్ధస్వరూపమైన ధర్మంలేదు. స్త్రీలకు చాలవరకు—కాదు—అన్నీని పురాతనాభిప్రాయాలే ధర్మాలై నిలచినవి. వాస్తవమునకు సహిష్ణుత యుదారత భ్రాతృభావం లేనివి ధర్మాలేగావు. ధర్మంవల్ల విరోధం మాయమగుచున్నది. దేని పేరు విూద విరోధోత్పన్నమగునో యది ధర్మమే గాదు. యేకారణంచేతైనా అందు తృణసమానమగు లోపాలుంటే వాటిని ధర్మసంస్కారులు పెకలించాలి. అదికూడా తర్కబుద్ధితో గాదు_శుద్ధహృదయంతో.

ధర్మసంస్కారమైన పిమ్మట సాంఘిక రీతి రివాజుల సరిజేయు టొక వింతగాదుగా? సాంఘికదోషాలను దూరంజేసే కష్టంకంటే దోషోత్పన్నము గాకుండానే చూడటం మంచిది. సులువు. సాంఘికత్యాచారములను ధర్మంద్వారానే మార్చుచూవచ్చారు. అది కూడా స్త్రీలే. స్త్రీలు ప్రతివస్తువును హృదయంతో పరీక్షించెదరు. ఇందువల్లనే హిందూదేశంలో యే యహింసాధర్మము త్పన్నమైనా దానిని స్వీకరించి ప్రచారము జేయు భారము స్త్రీలు వహిస్తూవచ్చిరి. మరియు నేటివరకు తమ జీవితమందు స్త్రీలు యీ యోగ్యతనుపొంది దానిని వికసింప జేసారు. నేడుకూడా స్త్రీలు—సోదరీమణులు__దానిలోనే తమ యావచ్ఛక్తినీ వినియోగింతురుగాక యని ప్రార్థించుచుంటిని.

# మెట్ట వేదాంతం

శ్రీమతి తెన్నేటి. రత్నావళిగారు

ఆంధ్రదేశములో వేదాంతము పెరిగి వృద్ధై ముదిరిపోతూంది. అందువలన పదేండ్లబిడ్డ మొదలు 70 యేండ్ల వృద్ధులవరకు ఒకటే వేదాంతం !! "బ్రతికేది మూడుదినములు యేమిటిశాశ్వతం" అని యెవరినోట వినినను యిదే వేదాంతం ఇదేమాట !!

ముసలమ్మలందరు గూడి ప్రొద్దుటనే నాలుగుగంటలకు లేవడము స్నానంచేసి దీపముపెట్టి ముక్కుమూసికొని ఆరుగంటల వరకు ఒకటే కొంగజపం తర్వాత భగవద్గీత, ఆదిత్యహృదయము మొదలైన పుస్తకములు చదువడం. అంతవఱకే వారి వేదాంతములు. ఆతర్వాత మాటలవేదాంతము తప్ప క్రియ సూన్యం. పిమ్మట కోడండ్లమీద వేదాంతమంతయు ప్రకాశింపచేస్తారు. కోడండ్లు కాఫీత్రాగగూడదు అనేమాట వారి వేదాంతములో ముఖ్యసమస్య.

మైలాపూరునందు మా యింటివద్దనే ఒక కలెక్టరు ఒకాయనవున్నాడు. ఆయన భార్య చాలామంచిది; విజ్ఞాని. పేరుసుశీల.

ఆమె ప్రతిదినమును భోజనానంతరము జడ్జిమెంటు, జ్ఞానావశిష్టం, భాగవతభగవద్గీత, భారత, రామాయణాదులను చదివి పరులకు వినిపించుచు పురాణకాలక్షేపము చేయుచుండును. భోజనానంతరము ముసలమ్మలందరు ముసుగులు సవరించుకొనుచు పురాణకాలక్షేపము చేయుటకుగాను ప్రతిదినమును ఈ సుశీలమ్మగారింటికి వెడతారు. వారు వెళ్లిరని వీళ్లు, వీళ్లు వెళ్లిరని వాళ్లు పంతములమీద అనేకమంది ముసలమ్మలు వారి యింటి పెద్దహాలునిండా పురాణము చదువునప్పటికి చేరుతారు.

విద్యావిశారద, వేదాంతియగు యీ సుశీలాదేవిగారు చదువునపుడు ఒకరిని మించినఒకరు వేదాంతులవలె అతిశ్రద్ధతో వింటారు. ఇట్లు ప్రతిదినమును వారిహాలు అరిగిపోవునట్లు కూర్చొని పురాణమువిని, పురాణానంతరము వారి యింటిగుమ్మము వద్దనే ఆవేదాంతమును విడిచిపెట్టి, సుశీలమ్మ గారిమీదను మరియు ఒకరిమీదఒకరు నేరములను చెప్పుకొనుచు యిండ్లకోడండ్ల విషయములు చెప్పుకొనుచు మెల్లిగా యింటికి చేరుతారు.

ఇంటికి వచ్చునప్పటికి కోడలు పువ్వులు కొన్నదనియో, లేక తనువచ్చునప్పటికి యింటివద్దలేదనియో, లేక కాఫీతయారుగా లేదనియో యేదోఒకసాకుమీద కారణము లేనిదే వేదాంతము ముదిరి, పక్వమై, అహంకారరూపముతో యింటివారిమీద నిప్పులను కురిపించుతారు.

అక్కడినుండి కొందరు వేదాంతులుకూడి మఱికొందరి వేదాంతమునుగురించి ఆక్షేపించుచుందురు. కామ, క్రోధ, మద, మత్సర, ఈర్ష్యా, లోభములను విడిచిపెట్టమని, గీతలోవున్నది. చూచితిరా యని చెప్పెడివారే కాని, ఆవిషయములను ఆచరణలోపెట్టిన వేదాంతి ఒకరునూలేరు.

అగ్గిరామునివలె స్వల్పవిషయమునకే

మండిపడుచు తాము సాత్వికులమని, తామహంకారములను చంపుకొని ఇతరులను చూచి ఈర్ష్యపడకుండ యుంటిమనియు, ఇతరులను అటులనే యుండమనియు ఒకరికి చెప్పెడివారే కాని తాము చేయరు.

"అహింసాప్రథమో పుష్పః"యని చదివెడివారేకాని దానిని ఆచరణలో పెట్టువారేరీ? నిర్గుణముతో తనువుపై ఆశవిడిచి ఎల్లరియందును సమభావముతో నుండవలసిన వేదాంతములా ఇవి? ముముక్షువులు కాగోరు మహామునులందరును అభ్యసించెడి వేదాంతమును మన మహావేదాంతులందరును చేరి నిర్గుణ స్వరూపమైనట్టి వేదాంతమును ఈ విధముగా పాడుచేయుచున్నారు. వేదాంత సారమును గ్రహింపక దానిని దూషించుచు ఒక్కదానినైనను ఆచరణలో పెట్టక, మేమందరియందును సమత్వము చూపెదమనియు, మేమేగొప్ప వేదాంతులమనియు చెప్పెడి వేదాంతులు "ఏమి వేదాంతులు"? పుణ్యముకొరకు చేయు వేదాంతమంతయు తుదకు పాపముగా మారుచున్నది. వేదాంతులెవ్వడును తాము వేదాంతులమని చెప్పుకొనెదరా? మనయొక్క సద్గుణములే వేదాంతములు, సద్గుణములులేని వేదాంతమేందుకు?

# భావకణాలు

శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మగారు

ఆసువర్ణయుగాల నృపాళి కల్ప
పాదపంబులు కవిపుంగవ ప్రశస్త
శీర్షముల రత్నరాశి వర్షించునప్పు
డామహాత్ముల పూత దేహములయందు
నట్టువలొనర్చి, మురిసి, యానాఁటి సంవి
ధానమున కంజలించు మాతలఁపులెల్లఁ
జివురులెత్తింప మిగిలిన జీవమణుల!
రాజ్యలక్ష్మికై నిత్య నీరాజనంబు
లొసఁగు కత్తులమొనలలో నొదిగియున్న
బలము జయురమాంఘ్రులకు నర్పణము
సేయ

నాహవావని వీర విహారములను
సలుపు నానాఁటి రాజసింహుల శరీర
గళిత సప్రాణరక్త బిందువుల యివ్వె!!
కటకు మొటకుల విషమసంగరములందు
రాక్షస వశంగతిన్ భీత రాజ్యలక్ష్మి
చెమ్మగిలు నయనమ్ము లాశీస్సులొసఁగ

ధైర్యమూనిన వీరకాంతామతల్లు
లెందఱానాఁడు వెనుకంజయిడక, ప్రళయ
కదనరంగాల నాడు సింగముల పగిది
నురికి, కీర్తుల దిగ్భిత్తు లొలయఁజేసి,
విజయలక్ష్మికి స్వాగతం బిచ్చినారో!
వారి శౌర్యచరిత్ర శాశ్వత మొనర్ప
"ఆర్ద్రిపుర్వుల"న్ బంగరు టక్షరాల
వ్రాసి, దాచియుంచిన దొక్క ప్రకృతి
మాత !!!

పోతుటీఁగైన చొర నంతిపురులయందు
శాత్రవకిరాత పాదాలసవ్వడి విని,
మానమే జీవనం, బభిమానమే ధ
నంబు, కులగౌరవంబె రాజ్యంబటంచు
వీతిహోత్రుని శరణంబు వేడుకున్న
నెలఁత మిన్నలపసిఁడి వన్నియలవెలుకు
కుంకుమపుబొట్లె యీరూపు గొన్న
యవియొ !!

# శ్రీ మంగళగౌరీ - వరలక్ష్మీ వ్రతాలు

శ్రీమతి ప్రక్కి వెంకాయమ్మగారు

శ్రీయని పేరుగన్న లోకమాతయును, జగన్మంగళకరిన్ని, వరదాత్రిన్ని అయిన పరమేశ్వరి దయవల్ల శ్రీమద్బహుధాన్య శ్రావణమాసము మంగళవతులగు మా సోదరీమణులచేత సంతోషముతోఁ గడపఁబడింది.

కొత్త పెళ్లికూతుళ్లు కొత్త కానుకలచేతనూ, కొత్తచీరలు, రవికలు, నగలచేతనూ ఆదరింపబడి అలంకరింపబడి శ్రీ వరలక్ష్మీవ్రతము యథా కల్పోక్తంగా ఆచరించుకుని మంగళ గౌరీపూజలు చేసుకుని ఆనందం పొందారు.

శ్రావణమంగళవారాల్లో ప్రతి ఊరా మహాలక్ష్మి తాండవమాడుతూ ఉన్నట్లుగా, పుణ్య స్త్రీలంతా తమకున్న కలిమిని ప్రదర్శిస్తూ బాగా అలంకరించుకొని గుంపులుగాచేరి "ఇదిగో మహాలక్ష్మి మీాయింటికి వస్తోంది" అని చెబుతూఉన్న రీతిని యింటింటికి పేరంటములకు వెళ్లి సెలగలు సంపాదించారు.

మనదేశంలో "సెలగ" అనే మాటకు సమృద్ధి అనే అర్థభావన ఉంది. మామిడి పండ్ల బేరంలో వందపండ్లు కొంటే కొన్న వందకుపైగా అయిదు యెక్కువ యిస్తారు. ఈ యివ్వడాన్నే "సెలగచెయ్యి" అంటారు. అంటే, కోరదగిన దానికంటే కోరిన దానికంటే యెక్కువ అన్నమాట.

అన్ని కాలాల్లోనూ అన్ని స్థలాల్లోనూ ఉన్న మహాలక్ష్మిని మనదేశంలోనే ఒక్క శ్రావణ మాసంలోనే పూజచేయడం అనగా అర్థం యేమన్నాఉందా? అసలు పూజంటే యేమిటి? దీనికోకల్పం—ఆ కల్పంలో పూర్వకాలంలో యెవరో యీ నోములు పట్టారనిన్ని యీ పూజలు చేశారనిన్ని, అలా నోచి, పూజచేసి కష్టాలన్నీ గడిచి ఐశ్వర్యం పొందారనిన్ని సుఖపడ్డారనిన్ని ఫలం చెప్పడం—ఇదంతా యేమిటి? పోనీ ఆకల్పంలో చెప్పినట్టు మనకాలంలో మనం యెరిగినచోట యెక్కడేనా గబుక్కున రాత్రి పగలుగా మారినట్టు దరిద్రులు మహదైశ్వర్యవంతులుగా గభీలుమని మారారా? అంటే అలాంటిది కనపడదు. మేం యిలా అన్నామని యీ నోములూ వ్రతాలూ వల్ల ఫలంలేదనిన్ని యివి చెయ్య నక్కరలేదనిన్ని మా ఉద్దేశం అని యెవరైనా అనుకుంటారేమో మా ఉద్దేశం యెన్నటికీ అదికాదు. ఈనోములూ వ్రతాలూ తప్పకుండా చెయ్యవలసిందే అని మా ఉద్దేశం. మేమున్నూ చేశాము. చేస్తున్నా. చేస్తాం.

సెలగలు వాయినం అంటే యీనోములు పూజలూవల్ల కోరదగినదానికంటె కోరినదానికంటె యెక్కువ ఐశ్వర్యం తప్పకుండా లభిస్తుందని సూచించడం అని మా అభిప్రాయం. ఈ వ్రతాలూ నోములూవల్ల

అలాంటి ఉత్తమమైన ఫలమే లేకపోతే యింతకాలం, అనాదిగా చిరకాలం నుంచి మనదేశంలో యీవ్రతాలు అనుశ్రుతంగా యిలా ఆచరణలో ఉండడం తటస్థించదు.

ఈవ్రతాలూ నోములూ పూజలూ అన్నీ యెవరో కొందరు వ్యక్తులు తాత్కాలిక స్వలాభం కోసం కల్పించారనే అభిప్రాయంతో జరిపే వాదంతో మాకు (మనకు) పనిలేదు. అయినా యీవ్రతాల (నోముల) అంతర్యభావాన్ని కొంతవఱకూ తరిచి చూతాం. అలా తరిస్తే, నోముల విధులు చూస్తే—శ్రావణమాసంలో మంగళవార శుక్రవారాలు అనగా వారానికి రెండుసార్లు పుణ్యస్త్రీలంతా యిల్లూ వాకిలీ పరిశుభ్రం చేసుకుని గుమ్మములకు పసుపు కుంకుమలు పెట్టి అలంకరించి తాము తలంటుకుని భర్తకు బిడ్డలకూ కూడా తలంటి నీళ్లుపోసి తాము సువర్ణ వస్త్రములు (బంగారము, బట్టలు లేక రంగుల్లోకల్లా ఉత్తమమైన రంగు అనతగిన తెల్లని బట్టలు) కట్టుకొని మనస్సులు నిర్మలంగా ఉంచుకొని సువాసనలు వెదచల్లే పువ్వులూ సువాసన ద్రవ్యాలూ సంపాదించి సిద్ధపరుచుకుని, తమయింట్లో చక్కగా గాలి ప్రసరించే స్థలంలో రాతితోకాని కఱ్ఱతో కాని చేయించిన గౌరీ (లక్ష్మి) చిహ్నమును ఆ పువ్వులు మొదలైనవానితో పూజించి, ఆరోగ్య ప్రదములై రుచికరములైన పదార్థాలతో బంధువులు మొదలైన యిష్టులతో కలిసి లఘువుగా సుఖంగా భోంచేసి, భోజనాలు అయిన తరువాత పుణ్యవరులంతా కలిసి అదేరీతిగా పూజలుచేసినవారి యిళ్లకు వెళ్లి, యెవరెవరు యెలా నోములూ వ్రతాలూ చేస్తున్నారో గమనించి, ఆ ఆచరణలో ఉండే మంచిని గ్రహిస్తూ చెడ్డను వదిలేస్తూ క్రమంగా జీవితకాలంలో ప్రతిరోజూ సర్వత్రా యిలాగే జీవితం గడుపుతూ ఉంటే—పూర్ణమైన ఆరోగ్యం—తద్వారా ఐశ్వర్యమూ వృద్ధి అయి సుఖపడడానికి చక్కని అవకాశం కలుగుతుందనిన్ని, యీ అలవాటువల్ల యిల్లూ, వాకిలీ, యింట్లో ఉన్న అన్ని వస్తువులూ, స్వచ్ఛములుగానూ, ఆరోగ్యము చెరిపే క్రిములు దుర్వాయువు మొదలైనవాటికి స్థానములు కాకుండానూ, ఉంచే స్వభావం యేర్పడి అందుమీద తమకు తమవారికి పూర్ణారోగ్యం లభించడంవల్ల ప్రతిపనిన్ని సకాలంలో సక్రమంగానూ యుక్తంగాను పరిపూర్ణంగానూ లాభకరంగానూ చెయ్యడమునకు అవకాశం యేర్పడడమున్ను, అందువల్ల శరీరానికి సుఖం, మనస్సుకానందం తృప్తి లభించడం జరుగుతుందనిన్ని, యీ వ్రతాలు కేవలం శ్రావణమాసంలో మాత్రమే కాక నిత్య వ్రతాలుగా జరుపుకుంటే పైన చెప్పిన మహాఫలం సర్వదా చక్కగా లభిస్తుందనిన్ని, యీనోములు వ్రతాలూ పెద్దలచేత యేర్పరచ బడ్డాయని తోస్తుంది.

మతంలో యీ నోములకు వ్రతాలకూ యెంతవఱకూ సంబంధమమ్మా అంటే, అదిన్ని ఉంది. అందుకే పైన "తృప్తి లభించడమంటూ" ఒకమాట అన్నాము.

ఐశ్వర్యం కలగడంవల్ల యిహ లోకంలో ప్రతి కుటుంబంలోవారూ సుఖంగా కాలం గడపడానికి సాధనములుగా చెప్పబడ్డ యీ వ్రతాలూ నోములుకీన్నీ మోక్షానికీ యేవిూ బంబంధం కనవడదు. కనుక మోక్షాన్ని గురించి యీ ప్రకరణంలో యేవిూ చెప్పకోనక్కర్లేదు.

ఐశ్వర్యమే అన్ని సుఖాలకీ, సంతోషానికీ సాధనమంటే—ఆ సాధనానికి ముఖ్య సాధనమైన ఆరోగ్యం విధిగా ఉండితీరాలి. మనస్సంబంధ మైనట్టిన్ని శరీర సంబంధ మైనట్టిన్ని ఆరోగ్యం అనగా—యేవని యెప్పుడు యేలాగున (యెవరికీ బాధకలుగకుండా తన యింట్లోవారూ తన యిరుగు పొరుగువారూ తుదకి లోకమంతా సుఖ భాక్కు లయేటట్టు) చెయ్యగలమో ఆలోచించి నిశ్చయించేశక్తి—ఇది మనస్సంబంధ మైన ఆరోగ్యం—ఇక అలా ఆలోచించి నిశ్చయించిన పనులు యథా నిశ్చితములుగా సకాలంలో చేసేశక్తి శరీర సబంధమైన ఆరోగ్యం—ఇదిగో యిలాంటి ఆరోగ్యం విధిగా ఉండితీరాలి. అదీ మేం చెప్పినమాట. తుదకు మనస్సంబంధ మైనట్టిన్ని, శరీర సంబంధమైనట్టిన్ని—శక్తి ఉండాలన్నమాట. ఈశక్తే అయిశ్వర్యం అనాలి. కాకపోతే పెద్దలు జగదీశ్వరి అయిన లక్ష్మిని శక్తి అని యెందుకంటారూ?

ఈభావం గమనించకుండా యీనోములు నగలూ చీరలు కూర్చుకోడానికిన్ని, ఖులాసాగా తోటి యిల్లాళ్లతో కాలక్షేపం చెయ్యడానికీ మాత్రం సాధనాలనే భావంతో మా సోదరీమణులలో యెవరైనా ఆ యెనిమిది వారాలూ గడిపి మామూలు అపరిశుభ్రత, అసంతృప్తి, యెడ్డితనం వదలకపోతే, యీ నోములు అలాంటివారికి ఐశ్వర్యం మూట కట్టి తెచ్చి యివ్వజాలవు అని మా నిశ్చితాభిప్రాయం. పైన చెప్పిన ఆరోగ్య శక్తులు సంపాదించుకోవడానికి అనుకూలంగా యిల్లూ ఒళ్లూ ఉంచుకుంటూ, మహాలక్ష్మీదేవి ఐశ్వర్యం యిస్తుందనే భక్తితో నోములు నోచే అమ్మలు ఆహా! పూజ్యరాండ్రే. సందేహమేముందీ.

శ్రావణ మంగళవార శుక్రవారాలలో లాగే ప్రతిరోజూ యిల్లూ వొళ్లూ ఆరోగ్య శక్తిప్రదాలుగా ఉంచుకోవడానికి అలవాటు పడ్డ యిల్లాళ్లకు యీ నోములూ వ్రతాలూ కల్పవృక్షాలే.

# రాధావధూటి

శ్రీమతి అడపా సుగుణమణిగారు

భార్యలను నిజనామాలతో పిలిస్తే ఆయుక్షీణమని అందువల్ల చెట్టుపేరో, గుట్టపేరో పెట్టి పిలవడం మంచిదని కొందరు నూత్నవధూవరులచే ఒకరి పేరు మరొకరిచేత పలికించడం ఆచారంగావుంది. అది ఆయుక్షీణానికి కారణం అయితే మన పెద్ద లెందుకా నియమాన్ని పాటిస్తారు. కాబట్టి నిజనామాలతో పిలుచుకోవడమే సముంజసమని మరికొందరు పురాణాల్లోను ఇతిహాసాల్లోను వున్నట్లుగా "ప్రేయసీ, ప్రాణేశ్వరీ, ప్రియా, ప్రాణేశ్వరీ" అని సంబోధించుకోవడం బాగుంటుందని మరొక కొందరు ప్రస్తుతం వాడుకలో వున్నట్లుగా "ఏమేవు, వసే, ఓయి, ఆ, నిన్నే, ఇదిగో, ఏం, లేవా అక్కడ" అని మాట్లాడడమే ఆచరణీయమని ఇంక కొందరు తమ తమ అభిప్రాయాల్ని వెల్లడించేరు. హిందూసంప్రదాయానుసారంగా వివాహకాలంలో కన్యకు అదివరకున్న పేరు మార్చి క్రొత్తపేరుతో అత్తవారు పిలవడం ప్రస్తుతం కొన్ని జాతుల్లో పరిపాటిగావుంది. సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే ఇవన్నీ కాలానుగుణ్యముగా మార్చబడ్డాయని తేల్తుంది. చూడండీ! భార్య పేరుతో కలిసి భర్తపేరు ఉంటుండేది. అప్పుడే అది పూర్తి నామధేయమయ్యేది. ఉదాహరణానికి "సీతారాముడు", "లక్ష్మీనారాయణుడు", "పార్వతీపరమేశ్వరుడు", "శచీంద్రుడు" ఇత్యాదులు. అయితే ఏకపత్నీవ్రతస్తుడయిన రాముడిని "సీతారాముడు" అంటే అన్వయిస్తుందిగాని పార్వతిని, గంగని భార్యలుగా గల్గిన పరమేశ్వరుని "పార్వతీపరమేశ్వరుడని", గంగాపరమేశ్వరుడని అనకపోవడంబట్టి చూస్తే బహుభార్యలుండేటప్పుడు భార్య ప్రాముఖ్యతనుబట్టి పేరువస్తుండేదని నిర్ధారణ చేయవలసివస్తుంది. కృష్ణభగవానుడుకి అగ్నిసాక్షిగ వివాహమాడిన భార్యలు, వలచి వలపించుకున్న కాంతలు లెక్కలేనంతమంది. ఇందరిలోను తన పేరుతో సంప్రదింపబడ్డది ఒక్క రాధా నామధేయమే. అనవరతము భక్తులచే స్తుతింపబడుచున్న ముద్దుల మూటగట్టు ఆ పేరే "రాధాకృష్ణ". పట్టమహిషి రుక్మిని, ప్రణయసామ్రాజ్యానికి అధిపత్యం కట్టుకోజాలే సత్య ఉంటుండగా ప్రాముఖ్యత పేరుప్రతిష్ట లేని రాధకు ఎట్లావచ్చింది ?

వైకుంఠపురంలో ఒకరోజున శ్రీహరి అంతరంగిక భక్తులతో ఇష్టాగోష్టి చేస్తుంటే ఇంద్రాణి అన్యకార్యార్థమై అచటికివచ్చి అతని దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శించి మోహపారవశ్యము జెంది మనోవాంఛితం నెఱవేర్చుకోడానికి పరంధాముని ప్రార్థించింది. భక్తవత్సల బిరుదాంకితుడగు విష్ణువు ఆమె కోర్కె తెలుసుకొని భూలోకములో తాను దేవకీవసుదేవులకు పుత్రుడై జన్మిస్తానని, శచినినందునకు చెలియలై రాధ అనే పేరుతో జన్మించమని, కృష్ణావతారమున ఆమె కోర్కె నెఱవేర్పబడుతుందని అనుగ్రహించేడు. ఇంద్రాణి అవతారము రాధయని గీతగోవిందములో చెప్పబడినది.

శ్రీమన్నారాయణమూర్తి రామావతారము దాల్చినపుడు వైకుంఠంలో ఉన్న లక్ష్మి రాముని రూపలావణ్యాదులువిని తనదగ్గరకు రాముని తెమ్మని శంకరుని కోరింది. శంకరుడు బ్రాహ్మణ వేషముదాల్చి శంభుభట్టారకు డనే పేరుతో భూలోకానికివచ్చి రాముని తోడ్కొనిజని లక్ష్మి సమక్షములో ఉంచాడు. లక్ష్మి రామునిచూచి మోహించి పట్టుకొనబోయింది. కాని ఏకపత్నీవ్రతభంగమునకు వెఱచి రాముడు తప్పించు




రాధాకృష్ణులు



లాఠిచార్జ్!

లోకమాన్య సేవాసంఘ వ్యాయామశాల బాలికలు లాఠీలతో వ్యాయామము నభ్యసించుట.

కొనిపోయేడు. రామావతారము చాలించి శౌరికృష్ణావతారము ధరింప నిశ్చయించినపుడు లజ్జాకరవతియైన లక్ష్మి పూర్వపు అభిలాష శంకరుడు శౌరికి తెలియపర్చేడు. దానికిచక్రి అంగీకరించాడు. అందువల్ల లక్ష్మియే రాధయై జన్మించినదని రాధామాధవములో వ్రాయబడ్డది.

సచ్చిదానంద లక్ష్మణపరబ్రహ్మం విషయానందం అనుభవించాలని తలంచి యోగమాయని రాధగా సృష్టించి తాను కృష్ణుని రూపుదాల్చి లీలావిహారం చేసేడని బ్రహ్మానందశతకంలో చెప్పబడింది.

పూర్వము బ్రహ్మదేవుడు వసువులలో ముఖ్యుడైన ద్రోణుని అతని భార్యను భూమిమీద నరులగా జన్మించమని కోరేడు. అందుకు వాళ్లిరువురు నర జన్మలో విష్ణుసేవ నొసంగుమని ప్రతిఫలం కోరేరు. దానికి కమలగర్భు డంగీకరించాడు. ద్రోణుడు, అతని భార్య, నందుడు, యశోదలై యమునాతీరాన్ని బృందదగ్గిరఉన్న రేపల్లెవాడలో జన్మించారు. వాళ్లకి ధాత వరప్రసాదాన్ని కృష్ణుని సేవ లభించింది. ఈ నందుని చెల్లెలే రాధ. కృష్ణుడుకి రాధ మేనత్తవావి. ఆమెకు చిన్ననాడే ఒక అనామధేయునితో వివాహం జరిగింది. అతడు వట్టిఘుంట. ఆ దంపతులకి పొత్తు కుదిరింది కాదు. గొల్లవెత్తితో రాధ వంక కన్నెత్తైన చూడక తిరుగుతుండేవాడు రాధమగడు. రాధకి యౌవన మంకురించింది. తన కనువైన ప్రియుడు లభింపలేదని విధిని దూరేది. తన దురదృష్టాన్ని నిందించుకునేది. తనలోతా నుస్సురనేది. చిన్ననాటి నుండి కృష్ణునికి యశోదతోబాటు రాధకూడా శుశ్రూషచేసి సంరక్షించింది. పెంచి పెద్దవానిగా జేసినతరువాత ఆ జగన్మోహనావిగ్రహాన్ని చూచి ముగ్ధయై మోహించింది. కాని యామెకు కట్టుబాట్లు మెండు. ఆమెపదినె, అత్త గోముఖవ్యాఘ్రాలు, మామగారు మంటలమారి, పెదబావగారు బెబ్బులి, పినబావగారు కఱకుతునక, ఇరుగుపొరుగువారు యమ ధూతలు, తోడికోడలు మాటలమారి, అన్నదమ్ములు మేకవన్నెపులులు, భర్తకోపిష్టి. అందువల్ల రాధాకృష్ణుల ప్రేమప్రవాహాని కెన్నో అంతరాయము లుండేవని శృంగార రాధామాధవసంవాదము రాధికాసాంత్వనము తెలియపరుస్తున్నాయి.

బృందావనందగ్గరఉన్న మండలో సహస్రగోపుడను శివపూజాదురంధరు డుండేవాడు. అతనికి భద్రకుడనే కుమారుడు శివవరప్రసాదమున రాధ యను కుమార్తె జన్మించేరు. త్రిలోకసంచారి నారదుడు సహస్రగోపునకు వరయోగ్యమైన రాధను తగినవరుడగు కృష్ణునకిచ్చి వివాహముచేయమని చెప్పి కృష్ణునితో రాధ రూపలావణ్యాదులను మనస్సుకు హత్తుకొనిపోయేటట్లు చెప్పేడు. నాటినుండి రాధాకృష్ణుల మనస్సులలో ప్రణయాంకురాలు నాటాయి. శ్రీకృష్ణుని కోర్కెపై సరస్వతి మధురవాణి యను పేరుతో మానవాంగనయై రాధాకృష్ణుల మనోభిప్రాయాల్ని సందేశహారియై మోసుకొనిపోయి వాళ్ల పవిత్రప్రేమకి దోహదమిచ్చింది. సహస్రగోపుడు తనకుమార్తెను కృష్ణునకిచ్చి వివాహంచేయ తలపెట్టెను. కాని భద్రకుడు తన అయిష్టత బహిర్పరచి దానికి అంతరాయం కలిగించాడు. పాప మా ముసలి గొల్లడు గత్యంతరములేక తన కుమార్తె కోర్కె నెఱ వేర్చమని శివునిగూర్చి తపస్సుచేశాడు. శివుడు ప్రత్యక్షమై యమునాతీరాన్ని గోమతి యను పట్టణాన్ని సృష్టించి దానికి సహస్రగోపుని రాజునిచేసి రాధ స్వయంవరము చాటింపుమని చెప్పి అంతర్ధానమయ్యేడు. స్వయంవరానికి నానాదేశపు రాజుల తోపాటు కృష్ణుడు వచ్చాడు. రాధ ముకుందినీ అనే చెలికత్తెద్వారా కృష్ణునికి సందేశమంపి కానుకగా కృష్ణనామాక్షరాంకిత పద్మరాగపతకము పొందింది. స్వయంవరంలో రాధ కృష్ణుని వరించి అతని మెడని పూలదండతో అలంకరించింది. తదితరరాజులు దీన్ని జూచి ఓర్వలేక కృష్ణునితో యుద్ధానికి తలపడ్డారు.

అందులో హాలగ్రీవుడను రాక్షసరాజు కుమారుడు నిజరూపమువాల్చి రాధను యెత్తుకొని తనరథముపై పెట్టుకొని పారిపోయేడు. బలరామకృష్ణులు హాలగ్రీవుని చంపి తదితరరాజులను ఓడించి రాధతో బృందావనమునకు పోతుంటే మార్గమధ్యాన్ని భద్రకుడడ్డుపడి కృష్ణునితో పోరాడేడు. కృష్ణుడు భద్రకుని చంపతలంచక వికటగాడీగర్భ మను బాణాన్ని అతని పై ప్రయోగించాడు. దానితో అతడు వికృతిరూపవు ఆడుకోతియై గంతులు మొదలుపెట్టాడు. సహస్రగోపుని ప్రార్థనవల్ల కృష్ణుడు భద్రకునకు తిరిగి పురుషత్వము ప్రసాదించి మామకు పుత్రదానము దయచేసి రాధతో బృందావనం చేరేడు. నారదాదిమునులు, శివుడు, బ్రహ్మ అచ్చటికివచ్చి రాధాకృష్ణులకు అగ్నిసాక్షిగా వివాహంచేసేరని రాధామాధవం తెలియపరుస్తుంది. ఈ రాధ కృష్ణుని మేనత్త రాధ కాదని కొందరి తలంపు. కాని దీనిని నిరూపించడానికి అవకాశాల్లేవు. పైనుదహరించిన చరిత్రాంశాలవల్ల రాధ జీవితావృత్తాంతం ఇదమిత్థమని తేల్చడం కష్టసాధ్యమైన పని. అయినప్పటికి పూర్వకవుల ప్రయోగాల్నిబట్టి చూస్తే శ్రీకృష్ణునకు రాధ మేనత్తవాలియని నిర్ధారణచేయవచ్చు. ఉదాహరణానికి— శేషము వేంకటపతి తారాశశాంకవిజయంలో తారచంద్రునికి బోధచేసే ఘట్టముదగ్గర "మేనత్త యను మేరమీరితి.........నీయలుగుబావ" అని ప్రయోగించాడు.

శ్రీకృష్ణుడు జగత్సృష్టి మొదలుకొని జరిగిన 28వ మహాయుగమగు ద్వాపరంలో 8 కోట్ల 63 వేల 875 సంవత్సరాల నాల్గునెలల ఇరవైయొక్క దినములు గతించగా అనగా శ్రీముఖ సంవత్సర శ్రావణ బహుళాష్టమినాడు జన్మించి 125 సం.ల 7 నెలల 8 దినములు భూలోకములో వెలశాడు. కృష్ణుడవతరించేటప్పటికి రాధ యౌవన. కృష్ణుని నిర్యాణముతోటే యాదవకులం అంతరించింది. అందువల్ల రాధ జీవితకాలం దీన్నిబట్టి ఊహించవచ్చును.

శ్రీకృష్ణు ఉద్ధవునితో ప్రసంగవశాత్తు ఆకృతికి పేరుబడ్డ రంభ రాధ కాలిగోరుకు సరిపోదని, రాధ ప్రియుని మనస్సెరిగి ప్రవర్తించే నేర్పు పదహారువేల గోపికాస్త్రీలలోను, తొమ్మండుగురు పట్టమహిషులలోను మరియొవరిదగ్గర లేదని అభిప్రాయముల వెల్లడించాడు. రాధ సౌందర్యఖని. ప్రియుని వశపర్చుకునే జాణ. రాధకి సంతానం కలిగినట్లు యెక్కడా చెప్పబడియుండలేదు. కాని ఆమెకు పిల్లలను పోషించడం అంటే యెక్కువప్రీతి. శ్రీకృష్ణునికి చిన్నప్పుడు ఉగ్గు పాలు పోయడం, ఊయలలోనుంచి పూచడం యెత్తుక ముద్దులాడడం చూస్తుండేది. తరువాత ఒక పిల్లను పెంచి ఇళాదేవని నామకరణము చేసి శ్రీకృష్ణున కిచ్చి పెండ్లిచేసింది. శ్రీకృష్ణుడు గోపికలిండ్లలో పాలు పెరుగు దొంగలించి అల్లరి పనులు చేస్తే గోపికలంతా యశోదతో ఫిర్యాదు చేయడానికి బయలుదేరారు. రాధ వాళ్లను మార్గమధ్యములో నిలిపి నచ్చజెప్పి కృష్ణుని మందలిస్తానని అభయమిచ్చి పంపివేసింది. రాధకి సమయోచితబుద్ధి మెండు. ఆమె పెంచిన ఇళాదేవికి స్వయంగా సంగీతం నేర్పింది. జంత్రవాద్య మెఱింగించింది. భరతశాస్త్రం పట్టించింది. కావ్యాలు చదివింపించింది. కవనము బోధించింది. రాధ సంగీతసాహిత్య భరతనాట్యాల్లో ఆరితేరిన చేయి. ఇళాదేవి పుష్పవతియైనప్పుడు గర్గుని పిలిపించి జాతకచక్రము వేయింపించింది. మాంత్రికులను పిలచి భూతాలురాకుండా ఇంటిచుట్టూ భూతి జల్లిపించింది. చెంచువాళ్లను పిలచి మందు లిప్పించింది. రాధకి మంత్ర తంత్ర జ్యోతిశ్శాస్త్రాలన్న, వైరాగిచిటికెలన్న నమ్మకం హెచ్చు. కృష్ణుని, ఇళాదేవిని కుంభకుడు విందులకని తీసుకొని వెళ్లిపోయేడు. అచ్చట ఇళాదేవి వలపులో పడి కృష్ణుడు రాధను మఱచివుండిపోయేడు. రాధ తాను పెంచినపిల్లని తనకు సవతిని చేసుకోవడం

ముప్పుని తరువాత గ్రహించి విచారించింది. రాధకు దూరాలోచన కొంచెం తక్కువ. మరికొంతకాలానికి వియోగాన్ని భరించలేక చిలుకద్వారా కృష్ణునికి రమ్మని సందేశమంపిరి. అప్పుడు చిలుకకి ప్రాణపదమైన చెలికత్తెకన్న హెచ్చుగా పెంచి రహస్యాలను వెల్లడించింది. రాధకు పక్షులను పెంచి వాటితో ప్రొద్దుపుచ్చడం యిష్టం. తన సందేశాన్ని అందుకొని కృష్ణుడు వచ్చేటప్పటికి రాధ అలిగి మానంతో పడుకొన్నది. కృష్ణుడు యెంత బ్రతిమాలినా శాంతించింది కాదు. దాసరి తప్పు దండంతో తీరుతుందని కృష్ణుడు రాధ కాళ్లమీదపడి దండంపెట్టాడు. అప్పటికి శాంతించక ఆమె తన యెడమకాలితో కృష్ణుని శిరస్సు తన్నింది. రాధ ప్రథమకోపి. కృష్ణుడు అలిగి వెళ్లిపోతుంటే రాధ యేడుస్తూ తనకు అన్యాయంచేయడం ధర్మంకాదని బ్రతిమాలుతుంది. రాధ కోపాన్ని యెంతోసేపు నిలుపుకోలేని స్వభావం కలది. ఆమె మంచివక్త. మాటలలో అంతరార్థాలు మనస్సు నొప్పించని హాస్యపుమాటలు దొర్లుతుండేవి.

రాధాకృష్ణుల వలపుచేష్టలు రహస్యంగా మూలదాగక కథావస్తువులై వీధిబడ్డాయి. ఎఱ్ఱన రతిరహస్యాన్ని రాధాకృష్ణులను ఆదర్శంగా తీసుకొని వ్రాసేడు. జైదేవుడు రాధాకృష్ణుల విరహాన్ని శృంగారరసములో ముంచివేశాడు. ముద్దుపళని రాధికాసాంత్వాన్ని పచ్చిగా వ్రాసింది. వెలిదిండ్ల వెంకటపతి రాధామాధవ సంవాదంలో రహస్యాలను బయటపెట్టాడు. ఈవిషయంలో ఆధునికకవులు కూడా పూర్వకవుల అడుగులపైనే నడిచేరు. రాధికాగీతాలు, రాధాకృష్ణనాటకాలు, ఒకటేమిటి, అంతా శృంగారరసమే. పాపము లోకంలో కోడై కూస్తుందన్న సామెత మానవాకృతి దాల్చిన భగవంతుడికీ తప్పింది కాదన్నమాట.

## మా చెల్లెలు

శ్రీమతి ఎం. సావిత్రిగారు

గీ. మల్లెపూవంటి బాల మా చెల్లెలమ్మ, చూచువారికి నేర్పును చురుకుదనము
ఆటలందు పాటలం దందముగను, ఒరవడిగ నున్న దెల్లర కూరిలోన.

గీ. నవ్వు మోమున నెప్పుడు నాట్యమాడు, మనసునకు నింపుకలిగించు మాటలాడు
అడుచుండు తెలుగుతన మూడిపడగ, మాకు నంతసమగునట్లు మరియు మురియు.

గీ. మాత దొందర పెట్టడు చేతలేదు, పనికిమాలిన మాటల బారిపోదు
బడిన చెప్పినపాఠాలు వల్లెవేయు, చిన్న బంగరుకొండ మాచిట్టితల్లి.

గీ. వేకువ నెలేచి పనులను వేగఁజేసి, నిదురబోయెడి యన్నయ్య నిద్రలేపి
నరవి జన్నీటనే తాను స్నానమాడి, పువులనేఱిచి గోపాలు బూజసేయు.

గీ. నిలుపుసీతమ్మ సావిత్రి నీతిమదిని, మొల్ల పదములు పలుమారు నుల్లమందు
పెరిగిపెద్దయి మాతల్లి పేరుదెచ్చు, పుట్టి మెట్టినఇండ్లకు ముద్దులొలుక.

# స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయములు

శ్రీమతి పంతం. అప్పామ్మజీగారు

మన హిందూసంఘములో విద్యాగంధ మెరుంగనివారు పెక్కురు గలరనుట విదితము. అందు స్త్రీల స్థితి అతి దైన్యము. పత్రికలు చదువుటవలను విద్య నభ్యసించుట వలను స్త్రీలు పాడగుచున్నారను మూఢ స్త్రీలు పెక్కురు మన పల్లెలందు గలరు. అందులో కొందరు మూఢాచారములకు లోనై పెక్కు కష్టములకు పాలగుచున్నారు. వారలు ఉదయాది మొదలు సాయంత్రమువరకు గృహ కృత్యములలోనే మునిగిపోవుచున్నారు. దేశ పరిస్థితులు, రాజకీయ విధానములు, ఆచార వ్యవహారములు దినదినమెట్టి మార్పులు బొందుచున్నవో వారికి తెలియదు, తెలుసుకొన శక్తి లేదు. అట్టి స్త్రీలకు గ్రంథములు పత్రికలు చదువుటయందు నభిరుచి గలుగజేసినఎడల వారలకున్న మూఢత్వమును కొంత పారద్రోలగలము. పూర్వము కంటె స్త్రీవిద్యకెక్కుడు అవకాశములు సమకూర్చబడినను ఇంకను ప్రతిరోధములుగూడా కలవు. పట్టణములలో స్త్రీవిద్యయెడ కొంత ప్రబోధము కలిగినను పల్లెటూళ్లయందు అట్టిదిలేదు. విద్యావ్యాప్తికి మార్గములు పాఠశాలలు గ్రంథాలయములు. ప్రచురింపబడు సమస్త గ్రంథములను ఎల్లరు తెప్పించుకొనజాలరు. అందువల్ల గ్రంథములను గృహలక్ష్మి మొదలగు మాసపత్రికలు వారపత్రికలు దినపత్రికలు సమకూర్చబడియుండు గ్రంథాలయములు ప్రతిగ్రామమునందును నెలకొల్పుటావశ్యకము. పెక్కుగ్రంథములను జదువుటవలన భాషాజ్ఞానము వృద్ధిపొందును. పత్రికాపఠనమువలను ప్రపంచములో ఎట్టెట్టి పరిణామములు గలుగుచున్నవో గ్రహించుటకు వీలగును. స్త్రీ యుద్యమము లెచ్చెటెచ్చట ఏవిధముగా కొనసాగింపబడుచున్నవో చర్చించుకొని ఆయాపద్ధతులలో వారికి యోగ్యములగు వానిని పరిగ్రహింతురు. మరియు పత్రికలలో ప్రచురింప బడు కథలు చదువుకొని మనస్సుల నుల్లాసవంతముగ ఉత్సాహముగ నుంచుకొందురు. గాబట్టి స్త్రీల జ్ఞానాభివృద్ధికొరకై ప్రతియూరను స్త్రీలకు ప్రత్యేకగ్రంథాలయములను స్థాపించిన పక్షమున ప్రతిసాయంసమయములందును ఆయూరి స్త్రీలందరు నచటకలుసుకొని పత్రికలు గ్రంథములను జదువుకొనుచు జ్ఞానము నభివృద్ధిగావించుకొనుచు మనస్సులనుత్సాహవంతముగ నుంచుకొని దినమంతయు తమ గృహకృత్యభారముచే గలిగిన శ్రమను దీర్చుకొని ఆకొలదిసేపైనను స్వేచ్ఛనుబడసి, విశ్రాంతిబొంది, చల్లగాలులయందు నడయాడి శరీరారోగ్యమును బొందుదురు గాబట్టి పతిగ్రామమునందును స్త్రీలకు ప్రత్యేకగ్రంథాలయములను నేర్పరుచుటకై ప్రభుత్వమునుబత్తిడి చేయువలయును.

# సంస్కారము

శ్రీ నెల్లూరి కేశవస్వామిగారు

"అమ్మాయీ! నీ పేరు?"

"శ్యామాబాయట. కాని నన్నందరూ 'శ్యామా' నే పిలుస్తారు."

"అయితే శ్యామా! నీకీ నాట్యమూ, గానమూ ఎవరు నేర్పారు?"

"రోజూ ప్రొద్దున మా ఇంటికో పంతులొస్తాడు, అతనే నాకు నేర్పేది."

"చాలా బాగా నాట్యం చేస్తావు శ్యామా! నిన్న నన్నక్కడ చూశావా?"

"ఊఁ......చూశాను."

"అయినా నే నెవరో నీకేం తెలుసు?"

"అప్పటివరకు తెలీదు కాని తర్వాత తెలుసుకున్నాను."

"ఎట్లా?"

"నిన్న మీ ప్రక్కన ఓ ముసలాయన నిలబడ్డాడు చూడండీ."

"ఆ?......ముసలాయనా?......ఏమోలే చెప్పు."

"అతను మా యింటిప్రక్కన వుంటాడు. నేనాయన్ని తాతయ్యాని పిలుస్తాను. ఆయనే చెప్పాడు. మీరు బాబూ రామ్‌నాథ్ జమీందారువారి కుమారులనీ, మీ పేరు బాబూ రామ్ మోహన్ అనీ...... ఆదేదో పట్నంలో చదువుతారనీ ప్రస్తుతం శెలవుల్లో ఇంటికొచ్చారనీ......నిజమే నా బాబూ గారూ?"

శ్యామతో నేను మొదటిసారి నదీతీరాన కలుసుకున్నప్పటి ప్రసంగం. చిన్నప్పటి సంగతి.

* * *

సంధ్యాకాలం. పడమటికొండలమీద ఇంకా ఎరుపు నిలిచివుంది. పక్షులు జంటలు జంటలుగా తమ గూళ్లను చేరుకుంటున్నాయి. పశువులు మందలు మందలుగా ఏటొడ్డుకు వస్తూన్నాయి. నదీతీరాన ఇసుకదిబ్బలమీద మేము కూర్చుని వున్నాము.

"అయితే, నువ్వు ప్రతిరోజూ నాట్యం చేయాలా, శ్యామా?"

"ఊహుం......తిరునాళ్లోగానీ, అంగళ్లోగానీ లేక పర్వదినాల్లోగానీ చేయాల్సొస్తుంది. అప్పుడు పైక మెక్కువ దొరుకుతుందట."

"ఆ వొచ్చే పైక మెవరు తీసుకుంటారు?"

"మా అమ్మ, నాన్న."

"ఎవరూ?......నిన్న నీప్రక్కన నిలబడ్డవాళ్లేనా?"

"ఊఁ"

ఇక మాట్లాడలేకపోయాను. మాట్లాడాలని కుతూహలముంది కాని ఏం మాట్లాలో తెలీలేదు. నా ఈ స్థితి గమనించి గామాలు శ్యామే అందుకుంది.

"మీ రిక్కడ ఇంకా ఎన్నాళ్లుంటారు?"

"సుమారు మూణ్ణెళ్లు."

కొంచంసేపు నిశ్శబ్దం.

"శ్యామా! నీ కింటిదగ్గిర ఎవరూ స్నేహితులు లేరూ?"

"ఊహుఁ, నా దగ్గిరకు రావటానికి ఎవరూ ఇష్టపడరు. అసలు వాళ్ల తల్లులు రానివ్వరేమో."

"మరి, ఒక్కదానివి ఎట్లా వుండగలుగుతావు?"

"మా ఇంటికో పత్రిక వస్తుంది. దాంతోనే కాలం వెళ్ళబుచ్చుతాను."

"అయితే, నీకుచదువుకూడావచ్చునా శ్యామా?"

"ఆఁ ఏదో కాస్తవచ్చు. చిన్నప్పుడు నేర్చాను."

"మరి, శ్యామా! రోజూ సాయంత్రమిక్కడికి రారాదూ. నాకూనూ ఇక్కడ ఎవ్వరూ స్నేహితులేరు. ఇక్కడివాళ్లంతా నాకు వెత్తివెత్తిగా అవుపడ్తారు. నువ్వొస్తే ఇద్దరం కులాసారా కబుర్లు

చెప్పకోవచ్చు......ఏం, వస్తావా ?"

"..........అ......"

* * *

అప్పటినుండీ ప్రతిరోజూ సాయంత్రం మే మిద్దరము నదీతీరాన కలుసుకునేవాళ్లం. దినమంతా ఏలా గడిచినా సాయంత్రంమాత్రం చాలా సరదాగా వుండేది. పట్నం విషయాలను, మా కాలేజీ విషయాలను ప్రతిరోజూ ఏకరువు పెట్టేవాణ్ణి. ఆమెమాత్రం విసుగులేకుండా శ్రద్ధతో వింటూండేది. ఒక్కొక్కప్పుడు, నా బలవంతంమీద, శ్యామ పాడేది. ఆమె పాడ్తూంటే నన్ను నేనే మరచిపోయేవాణ్ణి.

ఇల్లా గడిచేయి మారోజులు.

## 2

కొన్నాళ్లకు శ్యామ అకస్మాత్తుగా రావటం మానేసింది. కారణం బోధపడలేదు. ఎక్కడేనా నాట్యానికి పోయివుంటుందని వూరుకున్నాను కాని మరుసటిరోజుకూడా శ్యామ రాలేదు. నా ఆదుర్దా హెచ్చయింది. పోనీ, తెల్లవారస్నా వస్తుందేమో అనుకున్నాను. మూడోరోజుకూడా శ్యామజాడ లేదు. ఇహ ఆగలేకపోయాను...కాని, ఆగక ఏం చేసేది ? నా దురదృష్టానికి తోడుగా, శ్యామ ఇల్లు నాకు తెలీదు. నే నెన్నడా మె నడుగనూ లేదు, ఆమె చెప్పనూ లేదు. శ్యామ తల్లి పేరుమాత్రం తెలును. కాని ఎవర్నడగనూ ?... వేశ్యఇంటితో నాకేం పని? వారికి అనుమానం కలగదూ?...ఇహ ఏం చేయాలో తోచలేదు.

నాలుగోరోజున వూరంతా గాలించటం మొదలెట్టాను. కాని ఎవ్వర్నీ అడుగలేదు. నా ప్రయత్న మంతా వృథా అయిపోయింది. ఆయిదోరోజు ప్రొద్దున ఏదో పనిమీద ఓ బజారులోంచి పోతూంటే, అకస్మాత్తుగా శ్యామ నాకంటబడ్డది. ఓ ఇంట్లోంచి పరుగెత్తుకొస్తూంది. అప్రయత్నంగా నా నోటినుండి "శ్యామా !" అని వెలువడింది.

శ్యామ నన్ను ఆశ్చర్యంతో చూచింది. మరుక్షణం తలవంచుకుంది.

"శ్యామా ! నువ్విక్కడా ?" ఆశ్చర్యంతో అడిగాను.

మెల్లిగా అంది, "అవును...ఇదే మాఇల్లు."... తలెత్తింది. ఆమెకళ్లలో నాకు రెండు నీటిచుక్కలవుపడ్డాయి. నేను చకితుణ్ణయిపోయాను.

"ఇదేమిటి శ్యామా ! ఎందు కేడుస్తున్నావు ?"

తలవంచుకొని మెల్లగా అంది, "కొట్టింది."

"ఎవరు ?"

"మా అమ్మ."

"మీ అమ్మా ?...ఎందుకు ?"

దీనికి ప్రత్యుత్తరం లేకుండానే, "సాయంత్రం" అంటూ రివ్వున ఇంట్లోకి పరుగెత్తింది. నేను నిశ్చేష్టుణ్ణైపోయాను. నాకేమీ పాలుపోలేదు......కాని ఒక్కసారి నాకు స్ఫురణకొచ్చింది నే నే యింటి ముందు నిలబడ్డానో, అక్కడినుండి తిన్నగా జారుకున్నాను.

ఆ దినమంతా చాలా కష్టంగా గడిచింది. సాయంత్రం కాగానే గమ్యస్థలం చేరుకున్నాను. ఓ ఇసుకతిన్నెపైన చతికిలపడ్డాను. ఆలోచనలతో నా తల తిరిగిపోతోంది. మాటిమాటికి ప్రొద్దటిదృశ్యం కళ్ళెదుట కట్టినట్టువుపడ్తోంది. ఆ బెదిరిక చూపులు, ఆ దీన వదనం, ఆ కన్నీళ్లు...జ్ఞాపకం చేసుకుంటే కడుపు తరుక్కుపోతూంది...కాని ఆ తల్లి—ఆ కఠినురాలికి ఎట్లా చేతులు వచ్చాయో ఆ ముగ్ధను కొట్టడానికి ? ఇష్టం లేకున్నా నాట్యం చేయాలి, పాట పాడాలి, వారికి సంపాదించిపెట్టాలి. పైనుంచి—ఇంత యీడొచ్చినా—ఇంకా దెబ్బలుకూడానా ? తాను మాత్రం రోజూ ముస్తాబైతుంది, కాని ఒక్క రోజన్నా శ్యామకు మంచి చీర కట్టుకోడానికి ఇచ్చినట్టువుపడదే! తిండికూడా సరిగ్గా పెడ్తుందో లేదో?...

ఇవన్నీ కన్నతల్లి చేష్టలేనా?......

"మోహన్ బాబూ!"

తిరిగిచూశాను. నవ్వుమొహంతో శ్యామ నిలబడి వుంది.

"వచ్చావా శ్యామా?"

ముందుకొచ్చి కూర్చుంది. నా మొహం మీద గానే బొమలు ముడిచేసింది. "ఇదేమిటి, మోహన్ బాబూ! మీరు ఏడుస్తున్నారా? మీ కళ్ళలోంచి నీళ్ళేమిటి?" నాకంతవరకు తెలీదు నేనేడుస్తున్నానని. కళ్ళు తుడుచుకున్నాను.

"ఎందుకు చింతిస్తున్నారు? ఏమిటి మీ రాలోచించేది?"

మెల్లిగా అన్నాను. "ఇవ్వాళ్టి విషయమే ఆలోచిస్తున్నాను శ్యామా?"

తలత్రిప్పింది. "ఊఁ అదెప్పటి సంగతే బాబూగారూ!" నిరాశతో నిట్టూర్చింది. మళ్లీ అంది, "కాని మీరు దానికొరకు చింతిస్తూ, మనసు పాడు చేసుకోకండి."

"శ్యామా! మీ అమ్మ నిన్నెప్పుడూ కొడ్తూంటుందా!"

శ్యామ అవునన్నట్టు నావేపు దీనంగా చూసింది.

"మరి, ఒక్కసారైనా నాతోటి చెప్పావు కాదేమి?"

"సార్థకం?"

"ఏమీ, సార్థకమా? ఊఁ...అయితే ఈ నరకాన్నుండి నీకిక విముక్తి లేదనేనా నీయూహ?"

"అంతే అనుకుంటాను"

"ఎందుకిట్లా అధైర్యపడతావు?"

"మరేం చేయమంటారు నన్ను?"

శ్యామనుచూస్తే జాలేస్తోంది. నా హృదయంలో ఆందోళన ఎక్కువైంది. ఆలోచనా సముద్రంలో కొట్టుకుపోతూ వున్నాను. తీరిగ్గా, సావధానంగా, ఆలోచించడానికి వ్యవధి లేదు. తృటిలో నిశ్చయించుకోవాలి...కానీపటికి దృఢనిశ్చయంలో అన్నాను.

"శ్యామా! నీవీ చెరసాల్లో ఎప్పటికీ వుండలేవు, వుండకూడదు...విముక్తిమార్గం ఓటుంది. లేదని నిరాశపడకు...చెప్పనా శ్యామా?"

"ఊఁ! చెప్పండి." మెల్లిగా అన్నాను, "నేను నిన్ను రక్షిస్తాను".

"ఎట్లా?"

"నిన్ను పెళ్లాడి-" శ్యామ చిన్నగా నవ్వింది.

"మీ భ్రమ బాబూగారూ! నేనో వేశ్యనని మరిచిపోయారా?......మాకు పెళ్ళిళ్ళు కావు—కావుట మా తాతయ్య చెప్పాడు. అసలు మమ్మల్ని చేపట్టితే చాలు, సంఘం వాళ్లని వెలివేస్తుందట..."

"కాదు శ్యామా! అట్లా కాదు. మనుష్యుల్తోనే సంఘంకాని సంఘంలో మనుష్యులు కారు. సంఘం మనల్ని వెలివేస్తే, మనం సంఘాన్ని వెలివేయవచ్చు. అప్పుడు ఏ నిర్బంధమూ లేకుండా స్వతంత్రజీవులంగా బ్రతకవచ్చు...ఏం?"

"పొరపడుతున్నారు బాబూగారూ! మీ రిది వరకే పలువురికళ్ళల్లో పడ్డారు. అదేకారణంచాత నన్నీ నాల్గురోజులన్నించీ మీ దగ్గరికి రాకుండాచేసింది మా అమ్మ. ప్రతిరోజూ ఉపన్యాసాలు మొదలెట్టింది. కాని నాకవేమీ బోధపడేవికావు......మమ్మల్ని ప్రేమించేట్టు ఒకర్ని చేయాలిట కాని ఒకర్ని మేం ప్రేమించకూడదట...ఒకర్ని మావల్లో పడేయాలిట కాని ఒకరివల్లో మేం పడకూడదట; మేం పురుషుల ఆటపట్టువులా ఉపయోగపడాలిట గాని మాలో హృదయం వుండదట—వుండకూడదట......"

"చాలు శ్యామా! నువు వేయిచెప్పు, లక్షచెప్పు నిన్ను వివాహమాడి, నిన్ను రక్షించితీరుతాను...ప్రతిజ్ఞ చేయమంటావా శ్యామా?"

శ్యామ తలవంచుకుంది.

"శ్యామా! నే నన్న పసికుఱ్ఱాడిమాటలు గావు. రెండురోజుల్లో నా చదువు పూర్తవుతుంది, ఓ గొప్ప

వుద్యోగంలో ప్రవేశిస్తాను. అప్పుడు......"

"పెళ్ళవుతుంది" నవ్వుతూ అందుకుంది శ్యామ.

"ఆఁ...అవును. పెళ్లవుతుంది...తప్పక అవుతుంది...శ్యామతో."

శ్యామ మొహం వికసించింది.

## 3

మరుసటిరోజు కొత్త ప్రొద్దెక్కి లేచాను. నా దృష్టి మేజాపై నున్న ఓ క్రొత్త కవరుమీద పడ్డది. తొందరగా తీసిచూసాను. కవరతికించలేదు. ఉత్తరం తీసి చదవడ మారంభించాను:

"మోహన్ బాబూ!

అంతా తారుమారైపోయింది. నే నింటికొచ్చే సరికి మా వాళ్లంతా సిద్ధంగా వున్నారు, ఈ వూరు నుండి ప్రయాణం కట్టడానికి...అదేదో పట్నమట—ఇక్కడికి చాలాదూరమట—అక్కడికెళ్ళి మా వృత్తి నారంభిస్తారట. అర్ధరాత్రివేళ బయలుదేరటంలో వాళ్ల ఉద్దేశమేమిటో నాకేమీ తెలీటంలేదు. ఇప్పుడు—పదకొండైంది—మీ తుది దర్శనంకోసం వచ్చాను. కాని భాగ్యం లేకపోయింది. మీరు నిద్రలో నున్నారట. అందుకనే ఈ లేఖవ్రాసి మీ జవానుచేతికిస్తున్నాను.

ముందు నాకు ఏఏకష్టాలు, ఏఏ అనుభవాలు కలుగనున్నవో, నా భవిష్యత్తుకే తెలును. మీరు మాత్రం మీ ప్రతిజ్ఞని మీ జ్ఞాపకవీధిలో నుంచితిరా నాకదే పదివేలు. తర్వాత దైవసంకల్పం. ఉంటాను. నమస్కారాలు.

మీ అభాగిని
శ్యామ."

నిశ్చేష్టుణ్ణైపోయాను. చేతిలోంచి కవరు జారిపోయింది. అశ్రువుల్తో నిండిపోయాయి కళ్లు. అక్కడే మంచంపైన చతికిలపడ్డాను.

ఏమిచేయాలో తెలీలేదు. ఇహ ఆ వూళ్లో వుండలేకపోయాను. చదువు పూర్తికాకముందే పట్నం చేరుకున్నాను. మొదట ఇక్కడకూడా చాలా బాధగా తోచింది. కాని కాలపరిణామం దుఃఖాన్ని మింగేస్తుంది. శ్యామజాడ కనిపెట్టాలని భగీరథ ప్రయత్నాలుచేశాను. ప్రతి గొప్ప గొప్ప పట్నంలో వున్న స్నేహితులకు వుత్తరాలు వ్రాసాను. కాని అంతా నిష్ఫలమవడంచాత, వూరుకున్నాను.

## 4

ఏళ్లుగడిచాయి. చదువుపూర్తిచేసుకొని యిల్లు చేరుకున్నాను. నౌఖరీచేయడమంటే మనస్కొప్పలేదు. మా వంశవృత్తా, నాకు మొదటినేనచ్చదు. అసలు నేను సంపాదనకు బూనుకునేంత అవసరమేమీ అవుపళ్ళేదు నాకు. నాకేకొరతాలేదు. మా నాన్న కొత్త చదువుకున్నాడు. పిచ్చిపిచ్చి నమ్మకాలుగానీ, మూఢాచారాలుగానీ ఆయనకుగిట్టవు. కాబట్టి నాస్వంతవిషయాల్లో నాకు సంపూర్ణ స్వాతంత్ర్యమిచ్చాడు. ఇన్ని విధాల అనుకూల పరిస్థితులుగల నాలాంటివాళ్లన్నా సంఘసంస్కరణ కోసరం పాటుపడకపోతే, దేశమేలాగా అభివృద్ధిపొందుతుంది? అనిఅనుకొని సంఘసంస్కరణకు దేశాటన మారంభించాను. దేశీయులనుండు సాంఘికంగా బాగుపడాలన్న దృఢసంకల్పంతో ప్రచారం సాగించాను.

ఒకసారి మధురాపురంవెళ్లి రహదారి బంగళాలో బసచేసాను. దినమంతా ఆవూరివాళ్ళకొందరితో ప్రసంగించటంలో సరిపోయింది. సాయంత్రం ఆరింటికి, ముందువసారాలోని యీజీచెయిర్‌లో కూర్చొని, ఆ మరుసటిరోజున ఇవ్వబోయే ఉపన్యాసాన్ని గురించి ఆలోచించు కుంటున్నాను. ఇంతలో ఎదుటి మేడలోంచి సంగీతంవినపడ్డది. నాకు సంగీతమంటే చాలాసరదా. నా ఆలోచనలన్నీ తారుమారై పోయినాయి. శ్రీకంఠంలాగుంది. దాన్లోనిమాధుర్యం నన్ను పరవశుణ్ణిచేసి వేసింది. కాని అకంఠంలో మాధుర్యమెక్కువేకాక, ఏదో అని వార్యమైన విచారమూ

బాధకూడా వున్నట్టు నాకు స్పష్టపడ్డది. ఇక అక్కడ నిలవలేకపోయాను.

వెంటనే లేచి ఆ మేడ వేపు పరుగెత్తాను. మెల్లగా కిటికీలోంచిపొంచి చూచాను. ఆగదిమధ్యన ఓనవ యౌవనవిలాసవతి కూర్చొని పాడుతోంది. కొంచెం దూరాన కొంతమంది పురుషులు—అన్ని తరహాల వారున్నారు—తలలూపుతూ ఆలకిస్తున్నారు. మొదటి చూపే తెలియజేసింది అదొక వేశ్యాగృహమని. కాని ఆయువతి మొహాన విచారసూచనలు అవుపడుతున్నాయి ఎందుచేతనో?...అట్లా ఎంతసేపు నిలబడ్డానో ఆలోచించుకొంటూ నాకు తెలీదు. అకస్మాత్తుగా స్ఫురణ గలిగింది. నాలాంటిజాతీయనాయకులకు వేశ్యలయిళ్లలోకి పొంచిచూడటం భావ్యమేనా?......ముచ్చెమట్లు క్రమ్మాయి. దడదడలాడే హృదయంతో బస చేరుకొని యీజీచెయిర్‌లో చతికిలబడ్డాను.

పాట ఇంకా వినపడుతూనేవుంది. అదేమాధుర్యం... అదే విచారం......అదేబాధ. నా హృదయాన్ని కలతపెట్టాయి. ఆయువతి ప్రతిమ కళ్లకు కట్టినట్టుంది. ఆమె ఎందుకు విచారపడుతుందో?...సంగీతంమీద ఇష్టంలేనట్టుంది. కాని పాడుతుంది...అవును ఆమె ఒక వేశ్యగా! ఇష్టంలేకున్నా ఆడాలి పాడాలి; దుఃఖంలో హృదయం దహించుకుపోతున్నా పెదవి కూడా ఎప్పుడూ నవ్వుతూవుండాలి; ఎంత నీచునితోనైనా సరసంగా మెలగాలి...నటన అంతానటన—వేశ్య జీవితమేనటన...ఆమె ఎట్లా భరిస్తుందో! ఎంతబాధపడుతుందో!! ఇక ఈ నరకంలోంచి ఆమెకు విముక్తిలేదూ? ఆమె బయటకురాదలిస్తే ఆమెకు చేయూతనొసగే ఉదారస్వభావులు ఒక్కరూ ఈ విశాల ప్రపంచంలో లేరూ? ఏంలేక! సంఘం అంత గొడ్డుపోయిందా?...నేనే ముందంజవేసి సహాయం చేస్తే? అమ్మో! నేనొక సంఘసంస్కారినని మొదట్లోనే పప్పులో కాలువేస్తే సంఘం నన్ను పరిహసించదూ?...కాని నాలాంటి సంస్కారికి సంఘంతో భయమెందుకు? ఏం నా ఉద్దేశాన్నుంచి తొలగి పోతున్నాననా? అదెట్లా అవుతుంది. ఇదిమాత్రం సంస్కారంకాదూ? ఒక అబలజీవితం పాడైపోతూ వుంటే చూస్తూ ఎట్లావూరుకోవటం?...ఇంతకూ ఆమెకు నిజంగా ఏదైనావిచారముందో లేదో? వున్నా నా సహాయాన్ని ఉపేక్షిస్తుందోలేదో? అయినా కనుక్కోవడంలో తప్పేముంది?...ఏమీ లేకపోతే ఎవరిదారివారిది.

※

రాత్రి పదిగంటలైంది. అంతాచీకటి. మొహానికి ముసుగెట్టుకొని ఆ మేడ మెట్లెక్కుతున్నాను. 'ఎవరైనా గుర్తిస్తే' అనే ఆలోచనవచ్చేసరికి ముచ్చెమట్లు క్రమ్మాయి. తొందరతొందరగా మెట్లెక్కాను. పై ద్వారంవద్ద ఆయువతి నిలుచునివుంది తెల్లటిచీర, నల్లజాకెట్టు ధరించివుంది. ఆభరణాలట్టేలేవు. కొన్ని మల్లెపూవులు మాత్రం చెదరిన జుత్తును అలంకరించాయి. ద్వారం దాటగానే తలుపు నేనే వేశాను. అటూ ఇటూచూచి ఓ సోఫాలో కూర్చున్నాను. కాసేపటికి ఆయువతి నిదానంగావచ్చి నాకు రెండడుగుల దూరాన ఓచాపపైన కళ్ళెలుకడ్తూ కూర్చుంది. ఆగది నంతా కలయచూచాను. చాలా అందంగా అలంకరించబడివుంది. వస్తువులు చాలా నేర్పుతో అమర్చబడివున్నవి. పడకగదిగామూలు ఓమూల పట్టుతెరతో ఓదోమ తెరమంచంవుంది. ఎలక్ట్రిక్‌ఫాన్ విసరుతూ వుంది.

"మోహన్ బాబూ!"

ఉలికిపడ్డాను. ఏదో పరిచితకంఠం, ఏదో పరిచిత పిలుపు. ఆమె మొహం తేరిపారజూశాను. ఎక్కడో చూసినట్టు జ్ఞాపకం. ఎవరో జ్ఞాపకమొచ్చారు... కాని స్పష్టంగా పోల్చుకోలేకపోయాను.

"ఎవరూ?"

"నేను... నేను...మీ...శ్యామను..."

"శ్యామా ?"...... నా ఆశ్చర్యానికి అంతు లేదు...అవును ఆమె శ్యామే. అవే పోలికలు... అదే మొహం...కాని మార్పుంది...అప్పటి చిన్న శ్యామ ఇప్పు డెదిగింది...యౌవనం తొలకాడుతోంది.

"నువ్విక్కడెట్లా వున్నావు శ్యామా ?"

"ఈ ఉత్తరంలో మాకు తెల్పలేదూ, మే మిక మా వృత్తిని ఆరంభిస్తామని ?...ముందు కలకత్తా కెళ్ళాము. తర్వాత ఇక్కడికి..."

"వాళ్ళేరీ ?"

"ఎవరూ ?"

"మీ అమ్మా, మీ నాన్నా"

"వాళ్ళా ?" శ్యామ తలవంచుకుంది. కొంచం సేపు మౌనం దాల్చింది. ఆ తర్వాత అంది.

"వాళ్లు...వాళ్లు నా తల్లి, తండ్రులు కారు బాబు గారూ !"

నాకు చాలా ఆశ్చర్యమేసింది, "ఏమిటీ ? వాళ్ళు నీ తల్లితండ్రులు కారా ?...నీ కెవరు చెప్పారు ?"

"ఆమెనే చచ్చేముందు చెప్పింది...పూనాలో నే నొకబీదకుటుంబంలో పుట్టానట. ఆ కొద్దిరోజులలో నా తల్లిదండ్రి ఇద్దరూ చనిపోయారట. నా కింకెవ్వరూ బంధువుల్లేక పోవటంమూలాన, వీళ్ళు నన్ను తెచ్చి పెంచుకున్నారట...ఆమె రెణ్ణెల్ల క్రింద చనిపోయింది. అతనుకూడా పిచ్చెత్తి ఎక్కడికో వెళ్లి పోయాడు."

నా కొకవిధమైన సంతోషంకలిగింది గాని ఏం సార్థకం ? శ్యామను చూస్తే ఏడుపొస్తూవుంది.

"ఏమి టాలోచిస్తున్నారు బాబు గారూ"

"శ్యామా ! నీతో దూరమై ఏళ్ళు గడిచాయి గాని, ఇంతవరకు, నిన్నూ, నీతో చేసిన నా తుది వాగ్దానన్నీ మరవలేదు. ఆ ప్రతిజ్ఞే నన్నింతవరకు అవివాహితుణ్ణిగా వుంచింది."

"కాని...',

"కాని...ఏమిటి శ్యామా ?"

"బాబుగారూ ! ఇంతకుముందు ఏ భావంతో ఈ మేడ మెట్లెక్కారు ?" చకితుణ్ణయిపోయాను. ఆమెను నిజం ఎట్లా నమ్మించాలో బోధపడ్డేదు. "పొరపడ్తున్నావు శ్యామా ! నా మాటలని నమ్ము. ఇవ్వాళ సాయంత్రం నిన్ను పాటపాడేప్పుడు చూశాను. నన్ను పోల్చుకోలేదు కాని ఏదో అబల విచారపడ్తూవుందని మాత్రంగ్రహించాను. నాచేతనైనంతమట్టుకు సహాయం చేద్దామని వచ్చాను. అంతేగాని శ్యామా ! వేరే అభిప్రాయమేమీ లేదు. నిజం చెబుతున్నాను నమ్మవూ ?"

"నమ్ముతాను బాబూగారూ ! మీరు నాతో ఎప్పుడూ అనృతమాడరన్న నమ్మకం నాకుంది."

శ్యామకు నాపైన వున్న విశ్వాసానికి ఆశ్చర్యపోయాను. కాని ఆమెస్థితిని చూస్తే విచారం కలిగింది.

"విచారిస్తున్నారా బాబూగారూ?...ఎందుకూ?"

"మించిపోయింది శ్యామా ! మించిపోయింది" నిట్టూర్చాను.

"ఏమిటి ?"

"ఏమిటా ? అంతాను. నా ప్రతిజ్ఞను పూర్తిచేసుకోలేకుండా చేశావు.'.

శ్యామ తలవంచుకుంది. కాసేపటికి నా కేసి దీనంగా చూసింది.

"బాబుగారూ! ......"కొంచంసేపు నిశ్శబ్దం. మళ్లీ "బాబుగారూ !"

"ఏమిటి శ్యామా ?"

"మీతో నిజం చెబుతాను. నమ్ముతారా ?"

"తప్పకా......నువెప్పుడూ అసత్యమాడవుగా శ్యామా !"

"మీరు నన్ను నమ్ముతారన్న దృఢవిశ్వాసముంది నాకు."

"అయితే, మరి, చెప్పు."

"బాబుగారూ! ......నేను......నేను...... నేనింకా నిష్కళంకను."

నాకు చాలా ఆశ్చర్యమేసింది.

"నే నింకా చిన్నపిల్లవాణ్ణికానని, నీకు తెలుసు ననుకుంటా శ్యామా!"

"కాదు బాబుగారూ! నే చెప్పినదీ అనృతమూ కాలేదు. ఇప్పుడుకూడా నిజం చెబుతున్నాను. నమ్మండి. మనమిద్దరం మునుపటి శ్యామా మోహనులమే."

"మురికిలో పెరిగి, మురికిలో నివసించి, మురికి తగలకుండా వుండడం అసంభవం శ్యామా!"

"కాదు బాబుగారూ! అందరూ ఒకేలాగు కాదు. గులాబీపుష్పం ఎంతటి గొప్ప ఉద్యానవనంలో పెరిగినా, ముండ్లతో వేరు కాలేదు. కానీ, కమలాన్ని చూడండి, ఎంతటి అసహ్యతగల మురికిలో పెరిగినా, మురికికీ దానికీ ఆవంతా సంబంధంలేదు."

నిరుత్తరుణ్ణయిపోయాను. శ్యామదీనవదనం నా ప్రత్యుత్తరం కోసరం ఆశిస్తూవుంది.

"కాని శ్యామా! నువెన్ని చెప్పినా నా అంతరాత్మ నమ్మకుండావుంది."

శ్యామ మళ్ళీ తలవాల్చుకుంది. నేనయోమయంలో పడ్డాను. నాకేటూ తోచటంలేదు. శ్యామే అనృతమాడుతుందో, లేక నేనే పొరపడుతున్నానో, తెలీకుండా వుంది. నీ శ్యామకళ్లల్లోంచి నీటిబిందువులు రాలడం జూచి అదరిపడ్డాను.

"ఏడుస్తున్నావా శ్యామా?...ఏడుపెందుకూ?"

"మీరుకూడా నన్ను నమ్మలేకపోయారని, మీరు కూడా నన్ను గ్రహించలేకున్నారని......" శ్యామ వెక్కివెక్కి ఏడవటం మొదలెట్టింది. నాకేటూ పాలుపోలేదు......తిరిగి గద్గదస్వరంతో సాగించింది:

"......మీనుండి వేరైనన్నుంచీ, ప్రతి క్షణమూ మిమ్మల్నే తలచుకుంటూ వుండేదాన్ని. నా శీలం కాపాడుకోవడంలో నాకు గల్గిన కష్టాలని మీరూహించలేరు. కాని వాటినన్నిటినీ ఓర్పుతో భరిస్తూ వచ్చాను......ఒక్కొక్కప్పుడు జీవితంమీద రోత పుట్టేది. ఒక్క ఆశ—మిమ్మల్ని ఎన్నటికైన కలుసుకుంటానన్న ఆశతో జీవించివున్నాను."

శ్యామ ఇక నిలవలేకపోయింది. ఏడుస్తూ వచ్చి నా కాళ్లపైన పడ్డది.

ఇక నమ్మకుండా ఎట్లా వుండను?

"శ్యామా! ఇట్లా ఏడవటంవల్ల ఏం ప్రయోజనం? నేను మనఃపూర్వకంగా నీ మాటలను నమ్మాను. కాని ఇప్పుడేమి లాభం?"

"ఏం?"

"నేనిప్పుడొక జాతీయనాయకుణ్ణి, సంఘసంస్కారిని, నువు వేశ్యవని అందరికీ తెలుసు......"

"ఇప్పుడే కదూ బాబుగారూ! మీరిక్కడికి సంస్కారంకోర కొచ్చారన్నారు. ఇందులో వున్నది వేశ్య అనికూడా మీకు తెలుసునన్నారుగా?"... నే నిక మాట్లాడలేకపోయాను.

"బాబుగారూ! కాస్త ఆలోచించండి. మీమీదే ఆశపెట్టుకొని నరకంలోకూడా వుండి, జీవించుకూ వున్న ఓ అబలను రక్షించలేకున్న మీలాంటి సంస్కారులో నాకు బోధపడకుండా వుంది. మీసంస్కారము......"

"ఆగు శ్యామా! నేనిక వినలేను... నే నిశ్చయించుకున్నాను. నువు సిద్ధంగా వుండు రేపు రాత్రికే మన ప్రయాణం......చాలా రాత్రయింది ఇక పోతా. రేపు మళ్లీ కలుసుకుంటా, నువు మాత్రం సిద్ధంగా వుండు. విచారపడకు."

శ్యామ మొహం ఉత్సాహంతో వికసించింది. నేను నా బస చేరుకున్నాను.

౬

రాత్రిసంగతి ఎవరికీ తెలీనే లేదని నా నమ్మకం. కాని ప్రొద్దున్నే లేచేసరికి, నా బస ముందు గేటుకో పెద్దకాగితం అంటించి వుంది చదివాను:

"సిగ్గు! సిగ్గు!! సిగ్గు!!!"

"అర్ధరాత్రివేళ వేశ్యల గృహాలుజొచ్చే నీచులు కూడా నాయకులనీ, సంస్కర్తలనీ, పిలవబడటం నీచం, అతినీచం. ఇల్లాంటి నీతిభ్రష్టులను వద్దకు చేరనివ్వకూడదు ఇట్టి మోసగాళ్ళ మాటలు వినకూడదు. వీళ్ళ......"

ఇక చదవలేకపోయాను. దాన్ని చించి పారేశాను. అయినా ఈ సంగతి ఎంతమట్టు ప్రాకిందో తెలుసుకుందామని, బజారువేపుకు వెళ్ళాను. ఎటు వెళ్ళినా, నావేపే అందరూ వేళ్ళు చూపెడుతూ, నాగురించే గుసగుసలు పెడ్తున్నట్టు గోచరించింది. ఒకవేళ ఇది నా మతిభ్రమేమోనుకున్నాను. కానీ, నిన్న నాతో కులాసాగా మాట్లాడినవారుకూడా కొంతమంది, నన్నుచూచి తొలగిపోవటంచాత అంతా గ్రహించుకున్నాను. నాకు భయం కలగలేదు. వున్న భయం కాస్తా తొలగిపోయింది. నాలో ఓ నూతనోద్రేకం రేకెత్తింది..........సరాసరి శ్యామఇంటికి దారితీశాను.

పగలు పదిగంటల సమయం. అవే మెట్లెక్కుతున్నాను. కాని అంధకారంలేదు. నా తలపైన ముసుగులేదు. తలవంచుకొనికూడా లేను. భయంతో కాదు, సంతోషంతో......కాని రాత్రి సంతోషంతో ఆహ్వానించినశ్యామ ఇవ్వాళకన్నీళ్ళతో ఎదురైంది...

"బాబుగారూ! క్షమించండి. నా వల్ల ఊరంతా మీరు నిందలపాలయ్యారు. నన్ను నా స్థితిలోనే వుండనీయండి. నా వల్ల మీ కీర్తికి ముప్పుతెచ్చుకోకండి......వెళ్ళండి..."

"శ్యామా! ఏమిటీ మాటలు. నేను సంఘానికీ, ప్రజలకు భయపడ్తాననుకున్నావా? నా ప్రతిజ్ఞను పూర్తి చేసుకోవడమే నా ముఖ్యోద్దేశము. నేను సంస్కరణ కంకణం కట్టుకొని బయలుదేరినప్పటి నుండీ, ఇంతవరకూ అన్నీ వుపన్యాసాలే కాని, ఒక్కటీ క్రియారూపకంగా చేసి చూపెట్టలేదు. ఇంతకన్నా మంచితరుణం నాకు మళ్ళీ జన్మానకూడా దొరకుతుందా?.......శ్యామా! ఇల్లాంటి వెఱ్ఱిమాటలను లెక్కింపకు త్వరగా సిద్ధంకా, ఇప్పుడే బయలుదేరుదాం......"

ఊరివెలుపల, అదే నదీతీరాన—ఎక్కడైతేమేం మొదటిసారి కలుసుకున్నామో—ఇప్పుడొక భవనం నిర్మింపబడివుంది. దాని 'రాంనివాస్' అని పేరు. అందులోనే నేనూ నా శ్యామ—కాదు. "కమల"—కమలానికీ శ్యామకూ అట్టే భేదంలేదు—వుంటున్నాము. మా నాన్న ఉదారస్వభావంవల్లనే ఇదంతా కలిగింది. మా జీవితాంతమువరకూ మాకే కష్టమూ లేకుండా వుండేట్టు ఏర్పాటు చేసిపోయాడు...... మేం ఇద్దరమూ ఎప్పుడూ ఆయన ఆత్మశాంతికొరకై దైవాన్ని ప్రార్థిస్తూ వుంటాము.

# కట్నములు - లాంఛనములు

శ్రీమతి వట్టి శేషాంబగారు

మనదేశములో ఎక్కడ చూచినను ఈ ఘోరపిశాచము తాండవమాడుచున్నది. భారతజాతిని దుర్భర దారిద్ర్యమునకు లోను చేయుచున్నదీ పిశాచమే. ఐకమత్యమునకు తావులేకుండా మనస్పర్ధలు పెంచుచున్నదీ పిశాచమే. ఈవిషయమై కలహములు ఏదో విధమున ప్రతి కుటుంబమునకు జరుగుచునే యున్నవి.

పూర్వము కన్యాదాత కుమార్తెకు పెండ్లిచేసి అల్లునకు బహుమానంగా కలవారు కొంత ధనము ఇచ్చెడువారు. అది రానురాను ఆ బహుమానమునకు కట్నము అని పేరుపెట్టి వివాహమునకు ముందే బేరము చేసుకొనుచున్నారు. ఎంత నీచపద్ధతి! ఒకరు పేరంటమునకు పిలచిన, ఆమె వారుఇచ్చే పాయసములు బహుమానములు వగయిరా ముందే మాట్లాడుకొని, ఇంత విలువకలవి ఇచ్చిన వచ్చెదము లేకపోయిన రాము అని చెప్పిన ఎంత హాస్యాస్పదమో? అలాగుననే ఈ నీచమగు ఒడంబడిక కూడా చాలా అవమానకరము. ఈ పిశాచము విద్యావంతులలోను అవిద్యావంతులలోను కూడా ప్రబలియున్నది. కాని విద్యావంతులలో ఈరేటు ఎక్కువగనున్నది. థరుడు ఫారమునకు రు 500లు, స్కూలు ఫైనలకు రు 1000లు, ఎఫ్.ఏ.కు రు1500లు, బి,యేకు, రు 2000లు. ఇంకను విద్యావంతులు, ఆస్తిపరులు అయేకొలది, ఈ ధర ఇంకను హెచ్చుచున్నది. ఇప్పటి యువకులందరు జ్ఞానముకొరకు గాక, ఉద్యోగములకొరకు కట్నములకొరకు చదువుచు, ఆ విద్యకు అయిన ఖర్చుకు మూడురెట్లు అత్తవారివద్ద గుంజుకొనుచున్నారు. ఈపద్ధతి ఏవిధముగ జూచినను కడు ఏహ్యముగనున్నది. తాముకన్న కొడుకులను, బజారున పెట్టి కొన్ని వేలకు వేలంపాటవేసే మనుష్యులు, ఏయుగమునందైనా జన్మించిరా! ఇట్లు అమ్మబడిన యువకులు, శాస్త్రరీత్యా అత్తవారికి యావజ్జీవము, గుత్తకు తీసుకున్న నౌఖరులు అనుమాట తెలుసుకొనలేక, ఆయువకులు వారి తలిదండ్రులు, కన్యాదాతలమీద ఇంకను అధికారము చెలాయించుచున్నారు. అట్లయిన కట్నము పుచ్చుకొననివారు భార్యకు స్వాతంత్ర్యమియ్యక నానా బాధలుపెట్టుచు, అత్తవారి మీద అధికారము చలాయించమని కాదు. కేవలము ధనమునకు దాసులై యుండక, కన్యయొక్క రూప వయోవిద్యాశీలములు దృష్టినందిడుకొని ఒండొరుల అభిమతము మీద వివాహముచేసుకొని, ఆ గృహ రాజ్యమనెడు శకటమును, భార్యా భర్తల నెడు వృషభములు, ఐకమత్యమనెడు బల

ముతో లాగును. సమాన స్వాతంత్ర్యము కలిగియుండుటే గొప్పతనమని నా అభిప్రాయము. ఈకాలములో అట్లుకాక, ధనమే ముఖ్యముగనెంచి, వివాహములు చేయుటచేత, ఎన్నిరెూ సంసారములు భగ్నములై పోవుచున్నవి.

సాధారణముగా శుభకార్యములలో పట్టుకెళ్లబడు వస్తువులకే లాంఛనములనియు, తగువనియు పేరు. వీటిని మూడు విధములుగా భాగించవచ్చును: వియ్యపురాలు లాంఛనము, ఆడపడుచు లాంఛనము, శుభకార్యములలో పట్టుకెళ్లు వస్తువులు. మన హిందూదేశములో, ఎంత పేదవారైనప్పటికీ, ఆడపడుచుకు వియ్యపురాలుకు చెల్లించే ముడుపులు సరిగా చెల్లించవలెను. అట్లు చెల్లించకపోయిన, వారిపరువుప్రతిష్టలు అంతరించినట్లే! ఎంత అల్లరి చేయవలెనో అంత అల్లరి చేయుచున్నారు. ఇక ఆ నూతన వధువుయొక్క సాధింపులు, ఆ పరమేశ్వరునికే ఎరుక. తరువాత శుభకార్యములలో పట్టుకెళ్లబడు బహుమానములన్ననో! ఎంతగొప్ప విలువగల సామాను పట్టుకెళ్లిన అంత గొప్పతనమని భావించి, ఏదిరెూయొక వస్తువు తాకట్టు పెట్టియైనను, ఈ లాంఛనములు పట్టుకెళ్లుదురు. అట్లు తీసుకువెళ్లకపోయినను, లేక కొద్దిగా పట్టుకెళ్లినను, తమ ప్రతిష్టకు ఎంతో భంగమని విచారించెదరు. వారుకూడా పట్టుచీరలు తెచ్చినవారికి ఒకలాగునా, వెండిసామాను తెచ్చినవారికి ఒకలాగునా, బంగారుజతలు తెచ్చినవారికి ఒకలాగునా మర్యాద చేయుదురు. ఇదియుగాక, ఈ బహుమానములను, బాకీలగానెంచి, మరల వారి గృహములో, ఏదైన శుభకార్యము జరుగునప్పుడు వారు తెచ్చిన వస్తువులకు సరియయిన ఖరీదుగల వస్తువులు విధిగా పట్టుకెళ్లవలెను. అట్లు పట్టుకెళ్లకపోయిన, వీధినిపెట్టి చాటించి, ఎందుచేత తీసుకురాలేదని కబురుచేయుట కూడా కలదు. ఇంకను శుభకార్యములలో! ఆ గ్రామవాసులగు స్త్రీలను భోజనమునకు పిలచినప్పుడు పేరంటాండ్రు రవికలుగుడ్డలు పట్టుకెళ్లెదరు. మరల వీరింట్లో శుభకార్యములు జరిగినప్పుడు, ఆ రవికలుగుడ్డలు, మరల పట్టుకెళ్లవలెను. ఇటు అన్నియు అప్పులగానే యెంచి, ఈ దురాచారములు వృద్ధి చేసివైచినారు. సర్కారు శిస్తుకు షాహుకారు అప్పునకైనను బ్రతిమాలి వాయిదాలు వేయించవచ్చునుగాని, ఈ లాంఛనము అప్పుకు వాయిదాలేదు. ఎంత బీదవారైనప్పటికి వారు త్రాగే పాత్ర అయినా తాకట్టుపెట్టి పట్టుకెళ్లవలసినదే. కాని, ఊరికేపోయిన నిందలు చాలాగలవు. ఈ ఆచారము ఎక్కువ పశ్చిమ గోదావరి కృష్ణా జిల్లాలలో వ్యాపించి యున్నది.

అహో! ఏమివింత, అటు పాశ్చాత్యదేశముల నొక్కమారు తిలకింపుడు. ఆ యాంగ్లమహిళలలో నీ దురాచారములు గలవా! ఇట్టి దురాచారములుండిన వారు ఇంత ఉన్నతస్థితికి రాగలరా! చూడుడు. మొన్న జరిగిన ఆరవజార్జి సార్వభౌమునకు

జరిగిన పట్టాభిషేక మహోత్సవ సమయములో ప్రపంచమునంతను, గజగజలాడించుచున్న, జర్మనీనియంత హెర్ హిట్లర్ ఏమి పంపించినాడు ? స్వదేశ కర్మాగారములో తయారుచేసిన, పింగాణీ ప్లేటుగాదా ? ఏమి వింత ? రవి అస్తమించని సామ్రాజ్యము కలిగినటువంటిన్నీ, ప్రపంచములో ఎక్కువ బవలవంతులున్నూ అయిన ఆరవ సార్వభౌమునకు, కోటాను కోట్లు బహుమానముగా ఇవ్వను సమర్థతగల హిట్లరు పింగాణీ చిప్ప బహుమానముగా ఇచ్చినాడంటే మనకు ఆశ్చర్యమగును. 'కోటాను కోట్లు బహుమానముపొంద అర్హతగల నాకు పింగాణీ చిప్పయా? బహుమాన'మని సార్వభౌముడు వేదనచెందినాడా ? లేదు! లేదు! అది ఎంతో గౌరవముతో స్వీకరించి వారిని మర్యాదచేసి పంపించినారు. ఇంకను కొన్ని దేశములు వారు ఆశీస్సు పంపించినారు. అక్కడ మహిళామణులు కూడా ఇట్టి దురాచారములు అవలంబించినట్లు కన బడదు. మనిషిని చూచియూ లేక బహుమానమును చూచియూ మర్యాదచేయుట. వారు వివేకముగలవారు కావున డబ్బుఇచ్చి గౌరవము కొనితెచ్చుకొనుట వారియందు లేదు. ఇంకను వారు గొప్పగొప్ప గుణములు గలవారలను డబ్బుఇచ్చి గౌరవించక బిరుదులను కొన్ని కొన్ని గురుతులతోనే, గౌరవించుచున్నారు. కాని మనకు వలె ఒకరిని గౌరవించుట డబ్బుతోనే, వారు గౌరవించబడడము డబ్బుతోనే కాదు. మనము అన్నిటికి ధనమే మూలకారణముగా ప్రవర్తించుచున్నాము.

కాబట్టి ఈ కొంపలను మాపు లాంఛనములు కట్నములు రూపుమాపినగాని భారత దారిద్ర్య విముక్తిలేదు. ఈ ఘోర పిశాచములకు బలియై అనేక సంసారములు కూలిపోవుచున్నవి. కాబట్టి స్త్రీ పురుషులు వరశుల్కనిషేధదీక్ష పూని, ద్రవ్యమునకు వివాహమునకు గల సంబంధముపోయి నిరాడంబరముగను క్లుప్తముగను జరిగెడి వివాహ పద్ధతులు ఏర్పడిన నాడే బాలికకు బాధలు నివారణకాగలవు. కన్యాదాతల కష్టములు గట్టెక్కగలవు. లాంఛనములు మాసిపోయినగాని వియ్యములలో కయ్యములు పోయి నెయ్యము లేర్పడజాలవు. వీటిని రూపుమాపుటకు ముఖ్యముగా స్త్రీలే పూనుకొనవలయును. ఇవి రూపుమాసినగాని, దేశమునకు దారిద్ర్య విముక్తిలేదు. ఈవాంఛ స్త్రీల హృదయము నుండి తొలగించవలెనని ఆ పరమేశ్వరునికి వందనము లర్పించుచున్నాను.

# మాట

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

మాటలనుగూర్చి కొంచెం మాట్లాడుదాం. మనం హృదయగత భావాల్ని వెల్లడించుకొనే సాధనాల్ని మాటలని పిలుస్తాం. మాటలే సాహిత్యసౌధాన్ని నిర్మించాయి. మాటలచేతనే వాఙ్మయం మన్నన కెక్కింది. మాటలు లేకుంటే మానవహృదయం వెల్లడి కాదు. మాటలచే సాధింపరాని కార్యంలేదు. శిఫార్సు మాటచేత ఉద్యోగాలు లభిస్తాయి. అడ్వొకేట్ల మాటలతో కేసులు అడ్డంతిరుగుతాయి. దేశభక్తులమాటల్లో జాతీయతవృద్ధి పొందించేగుణంవుంది. ఇంతెందుకూ 'మాట'అనేదే లేకుంటే మరీ ప్రపంచంసాగుతుందీ?

నిత్యనైమిత్తిక వ్యాపారాల్లో ఇంతప్రాశస్త్యం వహించినమాటనే మరిచిపోతారు కొందరు. మాటల్లో మాధుర్యంఉంది. మాటల్లో గౌరవంఉంది. మాటల్లో మహిమఉంది. మాటంటేనే మండిపడతారు కొందరు. మాటల్లో చాలారకాలున్నాయి కటువుమాట, గంభీరమైనమాట, తియ్యనిమాట, మెత్తనిమాట, కల్లమాట, ఏటుమాట, పోటుమాట, పల్లికుమాట, పైపైమాట గట్టిమాట, ముద్దుమాట, దర్జామాట: మాటకు చెప్పాస్తే మరీ ఉన్నాయి లెండి.

సందర్భాన్నిపట్టి మాటలు మారుతుంటాయి. పోట్లాడేటప్పటిమాట కటువు. ఉపన్యాసంలో మాటలు గంభీరం. పిల్లలు పోరడితే అనునయించే తల్లిది తియ్యనిమాట. గురువర్యుల సపర్యలకు మెచ్చుకుంటూ మాట్లాడేది మెత్తనిమాట. సొమ్ములుతెమ్మని యేడిపించే భార్యకుభర్తచెప్పేది కల్లమాట. ఇంకా సౌకర్యాలుకోరితే మంత్రులుచెప్పేదీ కల్లమాటే. స్వాతంత్ర్యాన్నికోరితే ప్రభుత్వంఅనేది అమాటే. పుట్టింటినుంచి వరుసలు చక్కగా పట్టుకెళ్లకపోతే తోడికోడల నేది ఏటుమాట. డాబులునరికి నెగ్గలేకపోతే పొరుగువారనేది పోటుమాట. ప్రజాభిప్రాయాలంటూ పత్రికల్లో ప్రచురింపబడేది పల్లికుమాట. అతి ప్రయాసలకైనా ఓర్చి అసెంబ్లీల్లో చర్చకువచ్చేది పల్లికుమాటే. ఆఫీసునుంచి ఇంటికిరాగానే పైవాళ్లపై భార్యకుభర్తచెప్పేది పైపైమాట. లంచంపుచ్చుకుంటూ అధికార్లు కక్షిదార్లతో చెప్పేది పైపైమాట. సర్వే ఉద్యోగస్థులు రాస్తుమార్పు డానికి కరణాలతో ఏకీభవిస్తే ప్రమాటుమాటే. లేటుగావచ్చే గుమాస్తాను అధికారి కదురుకుంటూ అనేది గట్టిమాట. వచ్చీరాక పిల్లలు మాట్లాడేది ముద్దుమాట. పండక్కురమ్మంటే అల్లుడుగారనేది దర్జామాట. మలయాచలం జారితే ఎత్తుకోవచ్చు మాటపెదవి జారిందంటే మరీ వస్తుందా? దురదృష్టవశాత్తూ ఎంతమాటన్నా తిరిగి విత్‌డ్రా చేసుకునే సామర్థ్యం అసెంబ్లీసభ్యులకు మాత్రం వుంది. ఇలా చెప్పాస్తే వాల్మీకిగారి గ్రంథమంతౌతుంది.

మాట్లాడటంలో ఔచిత్యంవుంది. సందర్భాన్నిబట్టీ పాత్రౌచితినీబట్టి మాటలు వెలువడుతాయి. కొన్నిచోట్ల మనోతత్త్వాన్నిబట్టి మాటలు వస్తుంటాయి. వాటినే అభిప్రాయాలంటాం. మాటల సందర్భంలో రాయబారం వెళ్లే కృష్ణుణ్ణిచూచి క్రోధపూరితరాలైన ద్రౌపది నోటినుంచి ఈమాటలువచ్చాయి, "రాజసూయావబృధస్నానపవిత్రమైన ఈ ధమ్మిల్లాన్నిబట్టి యీడ్చిన దుశ్శాసనుని శరీరమింత లింతలై సంగరరంగంలో పడినప్పుడూ, రాజరాజుపీనుగునూ కర్ణుని కళేబరాన్ని కన్నారచూచినప్పుడే కేనిన్నాళ్లూ బడి గట్టుకొన్న కోపాగ్ని చల్లారుతుంది." పడరాని

# మ్యూనిచ్ సంధి అవసరము! అనవసరము!!



శ్రీమతి కమలాదేవిగారి అభిప్రాయము

అసలు బ్రిటను జర్మనీని ధైర్యముతో ఎదిరించి వుంటే ఈసంధి అనవసర మయ్యేది.

ఇదిఅవసరము, ఎందుకంటె సామ్రాజ్యవాదము, ధనిక వాదముతో అభివృద్ధిచెందుతూవుండే దేశాల ఆర్థిక పద్ధతి ఈ సంధిని తప్పని సరిగా చేసింది.

అక్కడ చేరినవారంతా సామ్రాజ్యవాదం నెగ్గడ మెలాగనే చూచినారు. చెకోస్లెవేకియా విషయం గాదు. యుద్ధమే వస్తే సామ్రాజ్యవాదం నశించి ప్రతి దేశంలోనూ విప్లవం తప్పకుండా వస్తుంది! దీని కందరూ భయపడ్డారు!!

ఈ సంధి ఇలా జరుగుతుందని కమలాదేవిగారి మిత్రులొకరు చాల దినాలకు ముందే చెప్పి పందెము వేసి రెండువందలు రు. గెల్చుకొన్నారట!



అస్తంగతుడు



జీ వ న ప థ ము

చిత్రకారిణి : శ్రీమతి లక్ష్మీబాయిగారు.

పొట్లుపడి ఆమె మనస్సు దుర్వారక్రోధ పూరితమైంది. ధర్మరాజు సంధిమాటలు ఆమె మనస్సుకు నచ్చలేదు. అతనిమాట ఆమెకు హృదయతాపం కలిగించింది. భీమునిమాట ఆమె ఆశలన్నీ అడుగంటజేసింది. విజయుని మాట విసిగింపు కలిగించింది. ఇంతెందుకూ ఆమె కృష్ణునితో వెలిబుచ్చిన అభిప్రాయాన్నిబట్టి అప్పటి ఆమె మనోతత్త్వం కన్నులకట్టినట్లుంది. ద్రౌపదికడుపు దుఃఖంచేత కాగి చల్లారిన అగ్నిపర్వతంలాగ దుఃఖకారకుడూ పుత్రహంతకుడూ ఐన అశ్వత్థామనుచూచి శాంతంగా సహజకోమలమైన స్త్రీ హృదయంతో మాతృదేవతామూర్తి గనుక ఇలాఅంది.

'భూసురుడవు బుద్ధిదయా
భాసురుడవు శుద్ధవీరభటసందోహా
గ్రేసరుడవు శిశుమారణ
మాసురకృత్యంబు ధర్మమగునా తండ్రీ!'

మాటమనోతత్త్వాన్ని సూచిస్తుందన డానికి ఇంత దూరం చెప్పాను.

ఇన్నిమాటలూపుట్టి ఇంత ప్రాధాన్యం వాటికికలిగేటప్పటికి మాటలమీద ప్రభుత్వంచేయడానికొక శాసనంకావాలిసొచ్చింది. ఈ శాసనంమాటలకు తరగతులూ సాధ్వసాధు నిర్ణయాలు, రూపభేదాలూ, సంధిసమాసనియమాలు ఏర్పరిచింది. ఈశాసనంపుట్టి మాటలను మడికట్టించింది, సదాచారాలు నేర్పింది. దాన్నే వ్యాకరణం అంటాము. కొన్నాళ్లకు మడిమాటలు మాట్లాడితే ఆదరణతగ్గుతూ వచ్చింది. ఆ మాటలకే మెరుగుపెట్టాలిసిన అవసరంకలిగింది, ఆ మాటలకే నవరసాలనీ అలంకారాలనీ పేరట్టి చిత్రంగా మాటలాడే నేర్పరితనం అలవరించుకొనే దానికి అలంకారశాస్త్రం ఆవిర్భవించింది.

సామాన్యంగా మాట్లాడుకుంటే బాతాఖానీఅంటాం. ఆమాటలన్నే శాసనానుగుణంగా బంధించి చిత్రంగా భావాల్ని వెల్లడించుకుంటే కవిత్వంఅంటాం. మాట నేర్పు కవికి అత్యవసరం. ఆమాటలన్నే శాస్త్రీయ వృత్తాల్లో ఇమిడించాలి. ఇతివృత్తాన్ననుసరించి పాత్రౌచితిని గమనించుకుంటూ పలికించాలి మాటలను. దానికే కవికిస్తైక్యతా కావాలి. ఇలాంటికావ్యాలే మన్నింపబడుతాయి. కావ్యాదులేకలిసి వాఙ్మయం ఐంది. మాటామాటా భేదిస్తే దెబ్బలాటవస్తుంది. మాటామాటాకలిస్తే స్నేహం వృద్ధౌతుంది. మాటామాటా పెరిగితే వాఙ్మయం పెరుగుతుంది. ఇప్పుడు వాఙ్మయమంతా మాటమీదనే ఆధారపడిందంటే నమ్మండి.

వ్యక్తిగౌరవాన్నిబట్టి మాటకు విలువమారుతూ వస్తుంది. సామాన్యవ్యక్తికే అధికారం ఇస్తాం. అధికారంగల వ్యక్తిమాట ఉత్తరువౌతుంది. దాన్ని మనమంతా శిరసావహిస్తాం. పండితులకు విజ్ఞానం అనుభవం ఉంది గనుక వారిమాట ఆదరిస్తాం. మాటకు అధికారమో సత్యమోలేకుంటే జనాదరణఉండదు మాటలకు. పేదరికంలేదని మాటలమీద దాడుతీస్తే తాగుబోతంటాం. ఆమాటలకు విలువఉంటుందా? అధికారమో సత్యమో సంపదోలేని వాళ్లెంతబాగా మాట్లాడినా లక్ష్యంఉండదు. బీటుపుస్తకంలో సంతకం చెయ్యలేకున్నా పోలీసుజవాను మాటంటే అందరికీ హడలూ, హైయ్యరుగ్రేడు మేష్టరు మాటంటే హాస్యాస్పదమూనా? పోలీసుబంట్రోతుకు ఎక్కువ తెలివుండి ఏడిచిందా? అధికారంగాకుంటే సంపదా గౌరవంఉన్న వాళ్లనుగూర్చి చెప్పాలిసొస్తే ఆవూళ్లో కంతా మాటగలవాళ్లు ఫలానావారని తర్జనీ చూపిస్తాం. తాలూకాగుమాస్తాలమాటలకేం విలువవుందీ. స్థితినిబట్టి మాటవిలువ నాణ్యాలలాగామారుతుంటుంది.

వ్యాపారాభివృద్ధికి మాటలుచేసేసహాయం పెట్టుబడి కూడ చెయ్యలేకుండావుంది. చిత్రంగా ఆకర్షణీయంగా అడ్వరటైజ్ చేయిస్తే చెత్తకైనా విలువస్తుంది. మాటల నైపుణ్యంతోనే లాయర్ల వ్యాపారం సాగుతుంది. అరచేతిలో వైకుంఠంచూపించేలాగు మాట్లాడ

తారుగనక నే ఇన్సూరెన్సుఏజంట్లు ఇంటాకవెస్తుకొస్తున్నారు. ఇలా గేమాటను నానావిధాలా ఉపయోగిస్తున్నారు తమతమ మేలుకోసం ప్రజలంతా.

'లోకోభిన్నరుచిః' అని వ్యక్తిభేదాన్ననుసరించి మాటలుకూడా రకరకాలుగా వెలసాయి. ఒక్కొక్కరిమాటల కొక్కొక్క ప్రత్యేకనైపుణ్యం వుంటుంది. సమయస్ఫూర్తిగా మాట్లాడేవారుకొందరు. సూచనగా మాట్లాడేవారు కొందరు. వ్యర్థంగా మాట్లాడేవారు కొందరు. ఎప్పుడూ హాస్యంగా మాట్లాడేవారు కొందరు. కొందరిమాట పిండికొస్తుంది పిడుగు కూవస్తుంది. కుర్రాళ్లు క్లాసులో మాట్లాడితే అల్లరి అంటాం. ఆడాళ్లం నలుగురుకలిసి మాట్లాడుకుంటే ముచ్చట్లంటాం. ఒకవిషయాన్ని సాధించడానికి, వివరిగామాట్లాడితే ఉపన్యాసం అంటాం. టీచర్లూ, ప్రొఫెసర్లూ క్లాసులో మాట్లాడితే బోధనవౌతుంది. కౌన్సిలర్లు శాసనసభల్లో మాట్లాడితే చర్చఅంటాం. అన్నీమాటలే.

మాటచిన్నదైనా ఫలితం గొప్పది కావచ్చు. సత్యము, శాంతిఅనేరెండు చిన్నమాటలతోనే అఖండ గౌరవమార్జించాడు మహాత్ముడు. ఉందన్నామాటే లేదన్నామాటే అక్షరాల్లో ఆధిక్యం లేకున్నా యాచకునికి ఫలితంఒకలాగే కనిపిస్తుందా? పదిఅబద్ధాలైనా మాట్లాడి ఒకయింటిని నిలబెట్టాలని మనపెద్దలమాట. నలుగురువాలుగు మాట్లాడి ఒకదేశాన్నే కాజేశారు నేటిరాజ్యాంగవేత్తలు. మాటకోసం ప్రాణాలైనా అర్పిస్తారు కొందరు. మాటనిలుపుకోడానికి రాజుగా వలసిన తనకొడుకుని అడవికిపంపాలిసొచ్చింది దశరథుడు, మాటకోసమె హరిశ్చంద్రుడు నానాకష్టాలూ పడ్డాడు. ఇప్పుడూ గ్రామఫోను రికార్డివ్వడంచేత సులభంగా మాట నిలుపుకోగలుగు తున్నారు.

అంతఅత్యవసరమైన మాటనే సమయోచితంగా మాట్లాడలేరు కొందరు. వారికిసానుభూతి. సమయానికి తగ్గట్టుమాట్లాడటమే సమయస్ఫూర్తి. సమయస్ఫూర్తి స్త్రీలకెక్కువన్నాడు కాళిదాసు. అట్టిదండతికీలభిస్తుందా? ఏమాట ఎంతదూరం పోతుందా? ఏంఫలితం కలుగుతుందా అని విచారించి పెదవిదాటనిస్తే చాలా లాభాలేవున్నాయి. మరిఒక కవిగారిమాట చూస్తాం.

"ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటి కామాటలాడి యన్యులమనముల్
నొప్పింపక తానొవ్వక
తప్పించుక తిరుగువాడె ధన్యుడు సుమతీ."

మాటవిలువతెలిసి మాట్లాడితే తగవులు తందనాలు దారుణకృత్యాలు జరుగకనేపోయ్యేవి. మానసోద్రేకం కలిగితే మాటల నిగ్రహించుకునే సామర్థ్యం అందరికీ కలగద్దూమరి. మాటల్ని శాసించడం మాటలా, అందరూ వాగనుశాసనులైపోరా. మాటలచేతనే పుణ్యపాపాలు లభిస్తాయి. జగడగొండివాళ్లకు మౌనమేమంచిది. ఏమంటారా మౌనేన కలహంనాస్తి,మూగవాళ్లకేబాధాలేదు. ఎక్కువ మాట్లాడితే వాగుడంటారు. మాటతో ఎటుపోయినామాటే. అందుకే మహాకవి ఒకాయన మందలించాడు.

'చెలిమియు పగయును చెలివియు
కలకయు ధర్మంబు పాపగతియును పెంపున్
దలువరితనంబును వచ్చును
పలుకుబడిన గాన బొసగ బలుకగవలయున్.'

మాటవరుసకింతదూరం మాట్లాడవలసి వచ్చింది. అన్నివిద్యలతోపాటూమాట్లాడటం కూడా నేర్చుకోవాలిసిందే. మాటనుగూర్చి ఇంకాబోలెడుంది. మరో మామాటు మాట్లాడుదాం.

# మందు

శ్రీయుత బి. కృష్ణరావుగారు

'అమ్మాయి నిన్న సాయంత్రమల్లా బాగానేవుంఠిందండీ పిన్నీ. ఒక్కటే జ్వరం. మీ అల్లుడుగారైనా వూళ్ళోలేరైరి.. వారు నిన్న ఉదయమే మా ఆడబిడ్డగారి వూరికి వెళ్ళారు. వారు వెళ్ళేప్పటికి గూడా బాగానే ఆడుకుంటూ వుందండీ........ అంతా సిద్ధమై చివరకి కోటేసుకొనే సరికి, 'నేనూ వూరికి వొస్తానని' అమ్మాయి యెక్కడలేని మారాము మొదలెట్టింది— యెందుకిల్లా అనవసరంగా మారాం చేస్తూ వుందా అనినారు కొంచం విసుక్కుని. అణా చేతులో పెట్టి, అప్పటికప్పుడు యెల్లానో సముదాయించి వెళ్ళిపోయారు. తరువాత సాయంత్రందాకా బాగానే ఆడుకుంది— కొంచం చీకటిపడగానే నేను పిల్లకి అన్నం పెట్టి పడుకోబెట్టాను. అర్ధగంట తరువాత మా రాముడికికూడా వొడ్డించి వొచ్చి చూతునుగదా అమ్మాయికి కాస్త వొళ్ళు వెచ్చబడివుంది. దృష్టిదోషం యేమన్నా తగిలిందేమోనని కాసిని మిరపకాయలూ, యేడు చీపురుపుల్లలూ వొంటిమీదినించి తిప్పి పొయిలో పోశాను. పుల్లలన్నీ చిటుపటు మన్నాయి—పిడికెడన్ని మిరపకాయలు తిప్పి పొయిలో వేసినా యింట్లో కొంచమైనా ఘాటన్న మాటేలేదు, అదో విధమైన మాడువాసన తప్ప.'

'అవునండీ అమ్మాయికి బాగా దిష్టే అయివుంటుంది.'

'యేమోనండీ, యేమీ తెలియటం లేదు. పిన్నీ, అసలు దృష్టి దోషమవుతే యింత జ్వర మెందుకొస్తుందండీ—నిన్న సాయంత్రంనించీ వొకటే జ్వరం—యింత వరకు చెమటన్న మాటేలేదు.'

'బజారులో యెక్కడచూచినా అక్కడ తల్లి ప్రత్యక్షం—ఆమె మహిమేమన్నా కనపడుతూ వుందేమో చూచారా.'

'పిన్నీ ఆకాస్తేదో మీరేచూతురూ? కాపురానికి వొచ్చి ఆరు సంవత్సరాలయినా నాకటువంటి దేదీ యింతవరకు అనుభవంలోకి రాలేదు—మీ పుణ్యముంటుంది, అదేదో మీరే చూచిపెట్టండి.'

'అయ్యో, దానికి యింత ప్రాధేయపడాల్సిన అవసరమేముందండీ? అమ్మాయిని చూచి నాకు తెలిసిందేదో చెప్పకపోతే మేము యింటిపక్కనే వుండిమాత్రం యేమి లాభం.'

శాంత చెమ్మగిల్లిన నేత్రాలని కొంగుతో వొత్తుకుంటూ 'బుజ్జి' పడుకొనివున్న గదిలోకి దారితీసింది. రాధమ్మగారు కాస్త విచారంగా, మెదలకండా శాంతను అనుసరించింది—యిద్దరూ రోగిని పరీక్షించి,

రెండు నిమిషాల తరువాత గది వెలుపలికి వొచ్చారు.

'యింకేమీ లేదమ్మా—యిదంతా ఆ తల్లి ప్రభావమే.'

'పిన్నీ, అమ్మాయికి ఈరోజే మందు పోయమంటారా, వొద్దా' అని శాంత కొంచం ఆదుర్దాగా పిన్నినడిగింది.

'మందా! అసలు ఈరోజు మందుమాటే యెత్తవొద్దు—ఆతల్లికి శాస్త్ర దండంపెట్టి రెండుపైసలు ముడుపుగట్టండి. ఆమె కృప వల్ల జ్వరం ఈరోజు సాయంత్రం వరకూ తిరుగుముఖం పడుతుంది.'

రాధమ్మగారు వెళ్ళిపోటంతోనే శాంత పైసలుతీసి, అమ్మవారికి దండంపెట్టి ముడుపు కట్టింది. యింక ఆరోజుకి మందూ, గిందూ అంతా చెల్లు—

* * *

మరునాడుకూడా 'బుజ్జి'కి జ్వరం తగ్గలేదు. ఆరోజు రాత్రంతా వొకటే పలవరింతలు—కూతురు అవస్థచూచి శాంత ఆ రోజురాత్రి యెంత ప్రయత్నం చేసినా పడుకోలేకపోయింది. ఉదయం లేవటంతోనే తమ్ముణ్ణి పిల్చి—

'రామూ, యిది తల్లి ప్రభావంకాదూ, మన్నూకాదు. 'బుజ్జి' కేదో పెద్ద జబ్బు చేసింది. దానికి పడుకున్నపాటు కదలటానికి కూడా చాత నవటంలేదు. రెండు రోజుల క్రితం వొచ్చిన జ్వరం యింతవరకూ దిగలేదు. నీవుపోయి యెవరినన్నా మంచి డాక్టర్‌ని తీసుకొస్తేనేకాని లాభంలేదంటూ' ఆమె కళ్ళల్లో నీళ్ళు నింపుకుంది.

అక్కగారి దైన్యాన్నిచూచి రాము యేమీ మాట్లాడలేకపోయాడు. తక్షణమే కార్యాలు తీర్చుకొని, కోటుకూడా వేసుకోకండా పైతుండుగుడ్డపైనే వుండగా డాక్టరు దగ్గరికి వెళ్ళాడాతను అమితమైన ఆవేదనతో.

అర్ధగంట తరువాత డాక్టరువొచ్చి 'బుజ్జి'ని యెంతోసేపు పరీక్షించాడు. సంగతి సందర్భాలు చూస్తే మనిషేమీ నిర్ధారణకి వొచ్చినట్లు తోచలేదు రాముకి—జబ్బేమిటో కనుక్కుందామన్న ఉద్దేశంతో

'యేమిటీ, యింతసేపు పరీక్షించారు' అన్నాడు రాము.

'ఆఁ, యేమీలేదు. రెండు రోజుల్లో నిమ్మళిస్తుంది.'

వొహనిముషం ఆగి ఆతనిముఖ కవళికని వీక్షించి—'మామూలు జ్వరానికే మీరు యింత గాభరాపడట మెందుకండీ' అని రాముని హెచ్చించి, ఆతన్ని మందుకోసం వెంటబెట్టుకొని కారులో యింటివేపు బయల్దేరాడు డాక్టరు బాబు.

'అసలు జబ్బేమిటని' కొంచంసేపుఅయిన తరువాత మళ్ళీ రెట్టించాడు రాము డాక్టరుని—

'యేదో పెద్దపేరు చెబితేమాత్రం లాభమేమిటి. మీకు జబ్బు నయమవటం ప్రధానంగాని.'

అంతటితో రామునోటికి తాళంపడింది. దారిపొడుగునా మళ్ళీ యేవిధమైన ప్రశ్నలకికూడా యిహ తావులేకపోయింది.

నాలుగు రోజులయినా అమ్మాయి జ్వరం తిరుగుముఖం పట్టలేదు—యింటి వాళ్ళకి డాక్టరుని మార్చటం తప్ప వేరే గత్యంతరమేమీ కనపడలేదు.

* * *

రోజుకి రోజూ అమ్మాయి చిక్కి శల్యమైపోతూవుంది. ఎందరు డాక్టర్లువొచ్చినా అసలు జబ్బు విషయమై యేమీ నిర్ధారణ చేయలేకండా వున్నారు. వొకరు 'టైఫాయిడు' వొకరు 'నిమోనియా' అంటారు. యిక్కడి డాక్టర్ల సంగతంతా చూచి అనవసరంగా కాలహరణం చేయటం సమంజసం కాదని తెలుసుకుని, బావగారొస్తే అమ్మాయినిగురించి యేదో ఆలోచిస్తారనే ఆశతో రాము 'అమ్మాయి జబ్బుగావుందని' తంతి నిచ్చాడు విశ్వేశ్వరరావుగారికి.

తంతిని చూడటంతోనే విశ్వేశ్వరరావుకి పై ప్రాణాలు పైననే లేచిపోయినాయి. కొంచమైనా ఆలస్యం చేయకండా తక్షణమే చెల్లెలి యుక్తంగా ఆవూరినించి బయల్దేరాడాతను.

ఇంటికి వొచ్చేసరికల్లా గూట్లో దీపాలు పెట్టే సమయమయింది. వొచ్చే రావటంతోనే కాళ్ళయినా కడుక్కోకండా ఆతను దగ్గరికివెళ్ళి 'బుజ్జీ, బుజ్జీ' అని ఆ నాలుగు యేళ్ళ కూనని తట్టిలేపాడు.

అమ్మాయి చివరకి కదలనైనా కదలకండా, నీరసంవల్ల అట్లానే పడుకునివుంది. తల్లి ఆవిషయం గమనించి 'బుజ్జీ, బుజ్జీ మీ నాన్నగారు వొచ్చారే' అంది.

'నాన్న' అన్నమాట వినటంతోనే బుజ్జి కళ్ళు తెరిచింది. గది నాలుగు మూలలు వొకమాటు కలియజూచి నిజంగా 'నాన్నగారు' వొచ్చారని తెలుసుకుని, నీరసంగా చిరునవ్వునవ్వుతూ రెండుచేతుల్నీ ఆతనికి అందించింది. విశ్వేశ్వరరావు లాలనగాఅమ్మాయిని వొళ్ళోకి తీసుకుని 'నాతల్లికి జబ్బు చేసిందా'అంటూ గట్టిగా ముద్దెట్టుకున్నాడు.

బుజ్జి గొల్లున నవ్వి 'నాన్నగారి' మొహాన్నంతా తన చిన్ని చేతుల్తో తుడుముతూ, అదో విధమైన అందంగా కళ్ళు తల్లికేసి తిప్పింది.

కూతురు చూపుల్లోని అర్థం గ్రహించి 'యేమమ్మా! మీనాన్నగారు వొచ్చారా, నీకోసం వూరినించి యేమి తీసుకొచ్చారో అడుగు' అంది శాంత ప్రేమపూర్వకంగా బుజ్జి బుగ్గ గిల్లుతూ.

ఆ సాయంత్రం నించీ బుజ్జి జ్వరం మటుమాయమై పోయింది.

* * *

'ఎందరో డాక్టర్లు కుదుర్చలేని జబ్బుని వైద్యమంటే అసలే తెలియని విశ్వేశ్వరరావుగారు నయం చేశారు' అంటుంది శాంత అప్పుడప్పుడు వేళాకోళంగా తన భర్తతో.

# సోదరి నివేదిత

సభ్యజాతు లన్నిటికిని ఒరవడి బంతియై సర్వజగజ్జేగీయ మానమైన, తన సభ్యత మాటువడ పారతంత్ర్యమునజిక్కి తన ముద్దుబిడ్డలు, పాశ్చాత్య నాగరికతావ్యామోహమున కర్తవ్యమూఢులై యుండ దుఃఖితయై తేజ మాసి, నలిగి, మసిపాతగట్టిన మాణిక్యమువోలెనున్న మనభారత జననిని, యామె యార్షమతమును, యామె సంతతిని, మనసార ప్రేమించి, జన్మచే విదేశీయయ్యు నాభావమును విడచి, విడువరాని స్వదేశమును, ప్రియ జననిని, సోదరులను, బంధులను, దేశీయులను విడచి, యీ దేశమునకు వచ్చి, దేశీయుల యక్కరలను గుర్తించి, వారికి పరాయిమనిషి సహాయము చేయుచున్నట్లు గాక, తాను వారిలో నొకతెయై, వారి జీవితములలో లీనమై, యద్భుతమైన తన మేధాశక్తిని, విజ్ఞానమును, వారి యభ్యుదయమునకు వెచ్చించి, కడకు తన ప్రాణమును సైతము, మన మాతృదేవి చరణములకడ నర్పించిన ధన్యజీవి, సోదరి నివేదిత.

పూర్వాశ్రమమున, మార్గరేటు నోబిలు అనబడు నీ కన్యారత్నము, ఆంగ్లదేశమున, డుంగన్నన్‌లో 1867 సం.రం అక్టోబరు 28 తేదీని జన్మించెను. ఈమె తండ్రి రివరెండు ఎస్. ఆర్. నోబిలు. ఈయన మంచి వాగ్ధాటిగల మతాచార్యుడు. లాంకషైరు యిండిపెండెంటు కాలేజియందు బనిచేయుచుండెను. ఈయన మాంచెష్టరు పేదల యభ్యుదయముకొరకు తనపదవిని తృణీకరించి తన్నువైచిన ధీరుడు. ఈయన సతీమణి యుత్తమురాలు. సాధ్వి. వీరి మూవురి సంతానములో మార్గరేటు పెద్దది.

నోబిలుకన్య భారతదేశగమనమునకు అంకురములు చిన్ననాటనే నాటబడెను. ఆమె చిన్నబాలికయై యాడుకొనుచున్న సమయమున నీ దేశమున చిర కాలము మతప్రచారకుడుగా బనిచేసిన యొకమిత్రుడు నోబిల్ దొరను ఆయన కుటుంబమును జూడవచ్చి కుశాగ్రబుద్ధియగు మార్గరేటును గాంచి "త్వరలో భారతదేశ సందేశము నిన్నాకర్షించగల"దని యాశీర్వదించెను. కాలగర్భమున దాగియున్న వింతలను జూడగల యీ ఈశ్వరసేవకుని వాణి యదార్థ మయ్యెను. ఈవాక్కు నీమె తల్లిదండ్రులు సైతము విశ్వసించిరి. మరణాత్పూర్వము నోబిలుదొర తన ప్రేయసిని చేరబిలచి "ప్రియా! మన ముద్దుతనయను భారతదేశ మాహ్వానించినప్పుడు నీ వడ్డుపడవలదని నా కోరిక" యని తెలిపెను. ఈకోరిక నాయన యిల్లాలు నెరవేర్చెను. పాప మీయన తన 34వ ఏట మరణించెను.

నోబిలుకన్య బాల్యమున చక్కగా చదివి, యా కాలపు ప్రఖ్యాత విద్యావేత్తల బరిచయముకలిగి, శిశువులకు నూతనపద్ధతిని విద్య బోధించుటయందు ప్రజ్ఞ బడసెను. బాల్యమునుండియు నామె యపూర్వ మగు మానసికశక్తిని కలిగియుండెను. వింబిల్డనునం దీమె స్వంతస్కూలు స్థాపించి విద్యాబోధన మొనర్చుచుండెను. ఆంగ్లదేశమున పేరు ప్రఖ్యాతమై యున్న సీసేముక్లబ్బీమె స్థాపించినదియే. అచిరకాల

మునసే యీమె ప్రఖ్యాత విద్యావేత్తయగునని యెల్ల రాశించుచుండిరి. కాని యింతలో నామెకు వేరు కర్తవ్యమును సూచించు నీశ్వరసందేశము వినవచ్చెను.

ఈ సమయమున హిందూవిజయభేరి మ్రోగించిన, యమరమూర్తి, స్వామివివేకానందుడు, లండనునగరమున యుపన్యశించుచుండెను. 1895 సం. రమున నాయన లండన్ మొదటవచ్చినప్పుడు స్వల్పముగాను, మరుసటి సంవత్సరము హెచ్చుగాను, యాయనబోధలనువిని, మార్గరెటు కన్య స్వామికి శిష్యురాలై తననామమును "సోదరి నివేదిత" యని మార్చుకొనెను. స్వామిజీసలహోననుసరించి, యీసోదరి భారతాంగనలయందు విద్యాప్రచారమొనర్చి, తనజీవితకృషిని భారతమాతృపాదముల కర్పించ ధృఢనిశ్చయ యయ్యెను. సాధ్వీమణియైన, నోబిలుసతి, భర్తవాక్కులను దలచికొని, దుస్సహమైనను, తనూజ వియోగమున కోడంబడి, యామె నాశీర్వదించి పంపెను.

జనవరి, 1898 సం. రమున నీమె, వివేకానంద స్వామితోగూడి తొలిసారి యీ దేశమునకువచ్చి, కలకత్తాకు సమీపమునగల బేలూరునందు విడిసెను. ఆసంవత్సరమున నీమెయొకసరి గురుదేవునితో, కాశ్మీరువరకు దేశసంచార మొనర్చెను. ఆసంవత్సరమే యీమెకలకత్తా యందొకస్కూలును బ్రారంభించెను గానిస్వామిజీ మరుసంవత్సరమమెరికా బోవలసివచ్చుటచే, త్వరలోనే నిలిపివేయవలసి వచ్చెను. కొంతకాల మమెరికాయందు సంచారమొనర్చి, వారిరువురును యింగ్లాండునకుబోయి, విమ్బిలుడన్ లో కొంతకాలముండిరి. పిమ్మట స్వామిజీయిండియాకు వచ్చెను.

సోదరినివేదిత, తిరుగ 1902 సం.రములో తన కృషినిసాగించుటకు కలకత్తాకువచ్చెను. ఆసంవత్సరము జూలై 4 తేదీని వివేకానందస్వామి యస్తంగతుడయ్యెను.

ఇందులకావంతయు చెక్కుచెదరని మనోధైర్యములో, సోదరి నివేదిత, మరికొన్ని దినములలోనే, గ్రీన్స్టైడల్ అనునొక యమెరికా సోదరి సాయమున కలకత్తాయందు లాల్బాగులోని, బోస్ పెరు సందులో సనాతన కుటుంబములనడుమ నొక చిన్న యిల్లద్దెకు దీసుకొని, యందు బాలికలకు విద్యగరపనారంభించెను. ఇచటనామె తొలుత పెక్కు కష్టముల నెదుర్కొనవలసి వచ్చెను. చుట్టుప్రక్కల నెక్కడను నొకరు చిక్కలేదు. వంటచేసికొనుటకు వీలు కలుగలేదు. అందుచే, కొన్నిదినముల పర్యంతమామె, కొద్ది రొట్టె, అరటిపండ్లనే, తిని జీవించవలసి వచ్చెను. తనయింటి ప్రక్కలనున్న సనాతనుల ప్రతికూల్యము నామె యోర్పుతోగూడిన ప్రేమతో నెదుర్కొని, వారి హృదయములను కరగించుచుండెను. ఇరుగు పొరుగువారి కేవిధమైన సంకటము నామెయెన్నడు కలిగించి ఎరుగదు. ఇట్లు కొంతకాలము గడచుసరికి, వశ్యకారియగు సత్య ప్రభావమువల్ల, నీమె రుజువర్తనము, నిరాడంబరత, సేవాసక్తిని గమనించి, ఎల్లరు నీమెయెడ సుముఖులు కాజొచ్చిరి. మరికొంత కాలము గడచుసరికి, పరమ సనాతనులగు గృహిణులు సైత మామెకడకేగ ముచ్చట పడసాగిరి.

మరికొంత కాలమగుసరికి బిడ్డల తల్లులగు యువతులు సైతమామె కడకువచ్చి, ప్రత్యేక తరగతిలో ఆంగ్లము, కుట్టుపని నేర్చుకొనుచుండిరి. నిరాధారులగు వితంతువు లామెకు ప్రత్యేకప్రీతి పాత్రములగుటచే, నామె వారికొరకు "సోదరీ శిక్షణాలయమును" స్థాపించి యందు వారి నుపాధ్యాయినులగా దయారుచేయుచుండెను. ఈకృషియం దీమెకు, సోదరి గ్రీన్స్టైడలు మిగుల దోడ్పడెను. తనవిద్యా సంస్కారమంతయు నామె విద్యార్థినులకు కరపుచు, తనస్కూలునే దేవళముగా భావించుటచే నివేదిత విద్యావిషయకృషిని పెక్కురు శ్లాఘించిరి. ఎందరో అమెరికా, యూరపు విద్యావేత్త లీమె కృషిని పరీక్షించి, మెచ్చుకొని, నాటంగోల మనదేశమునకు మిత్రులైరి.

ఈమె పొడగరి. పొడవైన ముఖము, విశాలమైన నుదురు, ఊదావర్ణము కలిగి, ప్రశాంతములై, జ్యోతిర్మయములైన నేత్రములు కలిగి, తొలిసారి చూడగనే శక్తిపూర్ణయని గోచరించెడిది. ఈమె మెడయందు రుద్రాక్షలు ధరించి ధర్మము, నిరాడంబర మూర్తి దాల్చినట్లుండెడిది. ఉదారమైన యామెమూర్తి ప్రకాశమానముగా నుండెడిది. తరచు, మనవారివలెనే చీర ధరించుచుండెను.

కొద్ది పరికరములుగలిగి నిరాడంబరముగానున్న యీమె యింట, స్త్రీలు చదువుకొను సమయములలో తప్ప, మిగత కాలములలో పురుషులకు నైతము స్వాగతమే లభించెడిది. ఈమె మిగుల స్నేహపాత్రయై, మిత్రులతో దాపరికము లేకుండ సర్వము దెలుపుచు, వారితో గంటలకొలది చర్చించుచు, వారి కొరకెంతదూరము పోవలసివచ్చినను వెనుదీయని స్వభావము కలదగుటచేతను, ఆమెతోడి సంభాషణము మధురమై, వాఙ్మయసదృశమై యుండుటచేతను, వంగదేశములోని ప్రఖ్యాతులగు కవులు చిత్రకారులు, కార్పొరేషన్ సభ్యులు, కౌన్సిలు మెంబర్లు, నాయకులు, విదేశీ యాత్రికులు మున్నగు వారామెను తరుచు చూడ వచ్చుచుండిరి. ప్రజాహితమునకు సంబంధించిన సమస్త కార్యములందామె శ్రద్ధ చూపెడిది. జగదీశచంద్రుని పరిశోధనల నామె యుత్సాహముతో దిలకించెడిది. ఆమె తరచు దేశాటనము సల్పియు, దేశీయులతో కలసిమెలసి తిరిగియు, విచటి పూర్వగ్రంథములను బఠించియు, దేశీయుల యక్కరలను కనుగొని శక్తికొలది తోడయ్యెడిది. ముఖ్యముగా భారతాంగనల యభ్యుదయమును గూర్చి తరచుగా తలపోయుచుండెడిది. చిత్రమేమన పునర్జన్మ గావించినట్లీమె తాను విదేశీయనను భావమునే మరచి మనలో నొకతెయై, యీదేశపు స్త్రీలను, వారి యక్కరలను గూర్చి మాట్లాడునప్పుడు "మనస్త్రీలు మన యక్కరలనియే" మాటాడెడిది. స్వసంఘమును దృఢీకరించి, యామె హిందువుల నడుమనుండు టాంగ్లేయులకు కంటకముగా నుండెను. ఆమె భారతదేశ ప్రేమను "తల తిక్క"యని "పిచ్చ"యని ఆంగ్లో హైందవ పత్రికలు వెక్కిరించుచుండెను. కాని వాటినామె లక్ష్యపెట్టి యెరుగదు. అట్టి వారితో చర్చించుట కామెకు వ్యవధియుండెడిది కాదు.

ఆమె తరుచు, మన నాగరికత, యాచారములు, స్త్రీవిద్య, పౌర బాధ్యతలనుగూర్చి మాసపత్రికలకు వ్రాయుచుండెను. తనవ్రాతలవల్లను, యూరపులోని యొక యభిమానురాలి సాయమువల్లను ఆమె తనజీవితమును, శిక్షణాలయమును సాగించుచుండెను.

తీరిక లేకున్నను, కష్టసాధ్యమైనను, చీపురు చేతబట్టి యీమె తన సందును, పరిసరములను స్వయముగా నూడ్చుచు, పౌరబాధ్యతలను సంతోషముతో నెరవేర్చుచుండెను. ఒకసారి కలకత్తానగరమున, ప్లేగు విజృంభించి, జనులు భయాతురులై, బండ్లు, ఓడలు, రైళ్లు నిండి పారిపోవుచుండిరి. అప్పుడీమె యావంతయు చలించక, యొక సేవాదళము నేర్పరచి, మురికి వీధులను స్వయముగా నూడ్చియు రోగబాధితుల కుపచరించియు తోడ్పడెను. పాపమొక యనాథబాలిక, మాతృమూర్తియై యుపచారములు సల్పుచున్న యీమెనే తల్లిగా భావించి, బిగ్గ కవుగలించుకొని యీమె యొడియందే ప్రాణములను వీడెనట. ఆహా! ధీరస్వాంతులకు రానిపండదనియు, అవసరమైన వారు మృత్యువుతో పోరాడ జంకరనియు నీమె బుజువు పరచినది గదా?

ఒకసారి యీమె గురుదేవునితో కూడి హిమాలయముపైనున్న సారానాథునకు డోలీలో పోవుచు నడువలేక యవస్థపడుచున్న యొక వృద్ధయాత్రికురాలిని చూచి జాలిపడి వెంటనే నేలకురికి యామెను డోలిలో కూర్చుండబెట్టి యాత్రచేయించి తాను వెళ్లునప్పుడు తిరిగి వచ్చునప్పుడుకూడ నడచెను.

ప్రయాణములో కటిక నేలను బండుకొనుచు, తన జన్మలో నట్టి సుఖమెరుగనని పల్కెను.

మానవస్వభావమునం దీమెకు విశ్వాసము మెండు. ఇండియాకు వచ్చుచు పెంకెయై ప్రాణము విసిగించుటచే చేతపైసయైన నీయక తల్లిదండ్రులు యిండియాకు స్టీమరు టికెట్టుమాత్రము గొనియిచ్చి దరువు గొట్టిన యొక యాంగ్లబాలుని చూచి యీమె దుఃఖించి వానికి తన ప్రియజనని జన్మదినకానుకగా నొసంగిన విలువగల ఏకైకవస్తువగు బంగారు గడియారము నొసంగి బుద్ధిగానుండుమని బోధించెను. నాటి నుండి యాబాలుడు పశ్చాత్తప్తుడై బాగుపడి మరణకాలమునందు సైత మామెను మరువలేదట!

అక్రమము, దౌర్జన్యము నామె సహించెడిది కాదు. ఒకనాడు రామలీలోత్సవమును చూడబోయి ఉత్సవము సమీపించగనే బండిదిగి కాలినడకను గుంపులో ప్రవేశించెను. తెల్ల దొరసాని వచ్చుటను చూచి యుత్సవములోనున్న పోలీసుభటుడు కంగారుపడి ఆమెకు దారిచేయుటకై జనులను లాఠీలతో గొట్ట జొచ్చెను. అదిచూచి యామె యంతవరకుగల ప్రసన్నతమాని కోపోద్రిక్తయై ముఖము జేవురించ నివ్వెరబోయి వాని చేయిబట్టుకొని "వారి నిట్లేల చెదరగొట్టెదవు? నీకు బుద్ధిలేదా?" యని మందలించెను. వాడు భయభ్రాంతుడై ప్రాణము వచ్చినట్లై వెనుకకు ఓసరిల్లెను.

ఆమె బంగాళా జాతీయోద్యమములో చేరి చాల ముఖ్యసమయమున బనిచేసెను. దేశభక్తియే మతమని, నిస్వార్థముగ లోకసేవయే జ్ఞానమని యామె బోధించెడిది. కృష్ణభగవానుడు బోధించిన "కృషి, కృషి" యనునదియే యీమె నిత్యశంఖారావముగానుండెను. బ్రిటిషుపరిపాలన ఎన్ని సౌకర్యములను కలిగించినను వాస్తవలాభకారి గాక దేశీయులను జలగవలె వారి రక్తనాళములను పట్టి పీడించుచున్నదని, యందుచే తొలగించవలెనని బోధించెడిది.

ఆమె గొప్పవక్త. కంఠము వీణానాదమువలె నుండి సభ్యులను గంటలకొలది మంత్రముగ్ధులవలె కూర్చుండబెట్టెడిది. ముఖ్యముగా యువజనులపై నామె శక్తి యధికముగానుండెను. వారీమె యుపన్యాసముల నత్యుత్సాహముతో నాలకించెడివారు. 1902 సం.నుండి యుపన్యాసములు ప్రారంభించి సంచార కార్యక్రమ మేర్పరచుకొని కలకత్తాలోనే గాక మద్రాసులోను, పశ్చిమదేశమున బెక్కుచోట్లను మూర్తీభవించిన పురుషమూర్తియో యనునట్లు హిందూధర్మప్రకాశతనుగూర్చియు, నూతనార్థములతో పురాతనాచారములనుగూర్చియు, జాతీయతనుగూర్చియు నుత్తేజకరములగు నుపన్యాసముల నొసగియుండెను. తన భావములను నిర్భయముగా వెల్లడించెడిది. భారతీయులు విదేశీయుల ననుకరించరాదని యీమె యెలుగెత్తి చాటుచుండెను. దీని పర్యవసానముగా మన వాఙ్మయము, కళలు, పౌరవిధులుమారి, స్వయంవ్యక్తిత్వముతో ప్రకాశించసాగెను. ఆమె కాంగ్రెసులకు పోవుచుండెను. స్వాతంత్ర్యభారత మామె స్వప్నమైయుండెను. ప్రపంచములోని యన్ని పత్రికలకంటె నామె యధిక యశాంతిని కలిగించెనని యొకరు వ్రాసియున్నారు.

## ఆమె గ్రంథములు

1900 సం.లో "కాళీమాత", 1904 సం.న "భారతీయ జీవితరంగము", 1909 సం.లో "నా గురుదేవుడు", "హిందువుల జోలపాటలు".

పైగ్రంథములన్నిటిలో "భారతీయ జీవితరంగ" మత్యుత్తమమని చెప్పుదురు. అయితే దీనిని అత్యుక్తి యని విమర్శించువారుకూడ లేకపోలేదు. మన నిత్యజీవితమునందలి మనము గుర్తించని విషయములను పరదేశీయైన యీమె గుర్తించగలుగుట శ్లాఘనీయము కాదా?

అతిప్రయాసవల్ల నీమె యారోగ్యముచెడి 1905 సం.న తీవ్రమగు మలేరియాకు గురియయ్యెను. శివ

గృహిణియగు నీలరత్నసర్కారు రీమెకు చికిత్సఁజేయువార్చి సంపూర్ణముగా విశ్రాంతి దీసికొమ్మని హెచ్చరించెను. కాని యందు కామె కవకాశమెక్కడిది? ఆసమయమున తూర్పుబంగాళమున వరదలు, క్షామము సంభవించి యీ మానవసేవాపరాయణురాలి దృష్టి నాకర్షించెను. తోడ్తోడ నీమె తన యారోగ్యమును లక్ష్యపెట్టక యచటికరిగి బారిసాలు జిల్లాయందు బురదలు, వాగులలో నీదులాడి, గ్రామగ్రామము, యిల్లిల్లు దిరిగి ఆర్తుల కుపచరించెను. ఈ సంచార ఫలితముగా 1906 సంవ నామె తీవ్రమైన మలేరియాకు గురియై కొంతకాలము ఆరోగ్యము పొందినను పూర్తిగా లేరుకొనలేదు. ఈసమయమునసైన నామె నివాసమును మార్చవలెనని మిత్రులామెకు సలహా యిచ్చిరి. కాని తోలుత మానవసేవ కవకాశమిచ్చిన యా స్థలమునువీడుట కామె యంగీకరించలేదు. మరి కొన్ని మాసముల కీమె మిత్రుల యొత్తిడివల్ల ఆరోగ్యముకొరకై దేశమునువీడి ఇంగ్లాండు అమెరికా దేశములలో దిరిగి 1910 సం.న నిచటికి దిరిగివచ్చి డార్జిలింగునందు నివసించెను. అవే యామె కడపటి రోజులు. జబ్బుగానున్నను నామె యుల్లాసముతో మిత్రులతో మన స్త్రీల విద్యాభివృద్ధినిగూర్చియే ముచ్చటించెడిది.

జన్మమంతయు నజ్ఞానమును తొలగించుటకై పోరాడిన యీ తేజశ్శాలిని యీదిగువ శ్లోకమును జదివి ప్రకాశమానయయ్యెడిది.

"అసతోమా సద్గమయా
తమసోమా జ్యోతిర్గమయా
మృత్యోర్మా మృతంగమయా."

"ప్రభూ! మమ్ము అసత్యమునుండి సత్యమునకును, అజ్ఞానమునుండి జ్ఞానమునకును, మృత్యువునుండి యమృతమువంకకును మరల్చుము."

డార్జిలింగునకు వచ్చుటకు కొలదిరోజులు ముందుగనే యీమె దిగువతెలిపిన బుద్ధదేవుని సందేశరత్నమును ఆంగ్లమున కనువదించి దానిని ప్రపంచమునకు ప్రార్థనగీతముగా నొసర్పగోరుచు మిత్రులకు బంపెను.

"సర్వజీవజంతువులు శత్రువులు లేకుండ ఆటంకములు గడచి దుఃఖమును జయించి ఆనందమును పొంది ఎవరి పథమున వారు స్వేచ్ఛగా ముందునకు సాగుదు!

"ప్రాచీ, ప్రతీచీ దిశలయందును ఉత్తరదక్షిణము లందును నుండు సర్వజీవులును, శత్రువుల నెరుగక ఆటంకములు గడచి దుఃఖమును మరచి ఆనందమును పొంది ఎవరి పథమున వారు స్వాతంత్ర్యవిరాజితులై ముందునకు సాగుదు!"

జీవితమంతయు ప్రార్థనగానే గడపిన యీమె యీ కడపటిప్రార్థనయే లోకమునకు కడపటి సందేశమయ్యెను.

1910 సం. అక్టోబరు, 10 తేదీని, కొద్దిగా మేఘములు తెరపియై, సూర్యోదయమై, కిరణము లీమె గదిలో ప్రవేశించగానే మరొక లోకమున మేల్కాంచుటకై చిరునవ్వుతో నీమె శాశ్వతముగా కనుల మూసెను. (అప్పటి కీమె వయసు 44 సం.లు మాత్రమే).

ఈమె మన యత్యుత్తమావసర సమయమున వచ్చి తాను పరదేశినన్న భావము మరచి మనలో నొకతెయై తొణకని ధైర్యము, ఔదార్యము, దయార్ద్రహృదయము, అద్భుతమైన మేధాశక్తిని విరామమెరుగని కృషితో తన జీవితసర్వస్వమును మన మాతృపదారవిందములకడ నర్పించి శాశ్వతశాంతి గాంచెను.

ఆచంట లక్ష్మీనరసింహం.

# అబలలా?

శ్రీమతి అంగర వెంకటకృష్ణారావుగారు

అలాంటి వర్షము ఎన్నడూ కురియలేదు. భోరుమంటూ ఏకాధ్వరంగా ఇరవై ఎనిమిది గంటలు పడింది. పెనుగాలివల్ల వేళ్లతో కూడా ఊడొచ్చి పెద్దవృక్షాలు పొంగి పారుతూన్న నదీనదాలవల్ల కొట్టుకొనిపోబడుతున్నాయి. మనుష్యసంచారం లేదు. చీమచిటుక్కుమంటే వినబడేటంత నిశ్శబ్దంగా ఉంది నిశీధము. చీకటి దట్టంగాఉంది. నక్షత్రాలైనా లేకపోవడంవల్ల దగ్గరగా ఉన్న వస్తువులే అగుపడడంలేదు. అప్పుడప్పుడు మెరుపులు తళుక్కుమంటే పరిసర వస్తుసమితి స్పష్టంగా కానవస్తూంది. మొత్తానికి ప్రకృతి మూర్తీభవించిన మృత్యుదేవతలాఉంది.

అలాంటిసమయంలో తన వాడుకప్రకారం సీత, పల్లెకుపోతూంది. సీత ఒక హరిజనయువతి. తన పల్లెనుంచి రోజూ పట్నంవెళ్లి అక్కడ భిక్షమెత్తుకొని రాత్రి ఏడెనిమిది గంటలయేసరికి యిల్లు చేరుకుంటుంది. సీతకి భర్త లేడు. చనిపోయాడు. ఇద్దరు మొగపిల్లలూ, ఒక ఆడపిల్ల ఉన్నారు. పిల్లలు చిన్నవాళ్లవడంచేత వాళ్లని పోషించడం బాధ్యత సీతదే. ఇళ్లలో కూలిచేసి ఎక్కువగా డబ్బు సంపాదిద్దామంటే; హరిజనయువతి అయిపోవడంవల్ల దగ్గిరకి రావడానికి వల్లకాదు. మైల! మైల!

అంత భయంకరసమయంలోకూడా, పిల్లలపై ప్రేమచేత సీత పట్నానికి బయలుదేరింది. అవునుమరి. తను బయలుదేరకపోతే ఇంటిదగ్గర పిల్లలదారి? వారికి రాత్రి తిండి ఎలావస్తుంది. అప్పుడే ఎనిమిది అయిపోయింది. వెళ్లాలి. దొరికిన నాలుగు గింజలు ఉడకెయ్యాలి. పాపం ఇంటికెళ్లగానే పిల్లలందరూ ఎంతో ఆతురతతో చుట్టూ మూగుతారు అమ్మ ఏమిటో తెచ్చిందని. అందుచేతే బయలుదేరింది ఇంటికి ఆ భయంకరసమయంలో.

సీత వెళ్లేదారిలో ఒక వంతెనఉంది. అది రైలువంతెన. రోజూ సీత ఆవంతెన దాటి తన పల్లెకిపోవాలి. నడచినడచి ఆ నాకు వంతెన చేరుకుంది. నాడు వంతెన మీంచి నీరు జోరుగా పారుతోంది. పాపం ఎలా వెళుతుంది. అలా నిలిచిపోయింది అతిదీనంగా నీటివైపు చూస్తూ పిల్లల్ని తలుచుకుంటూ.

వర్షం ఆగకుండా కురుస్తోంది. గాలి 'భోరు'మని వీస్తోంది. వారధిమీంచి నీరు జోరుగా పారుతూంది. సీత హృద్వాహిని ఇంటివేపు పరువెడుతోంది. లెక్కలేనన్ని తలంపులు ఉద్భవిస్తున్నాయి. ఏమిచేయడం?

పరాకుగా నిలుచున్న సీతకి గుభిల్లని శబ్దం వినబడింది. సీతగుండెలు 'పటాలు'న పగిలిపోయినట్లయేయి. వంతెన కూలిపోయింది. మరి ఇల్లు చేరుకోవడం కల్లోవార్త. హృదయం బరువెక్కిపోతూంది. పిల్లలు ఏమి ఇబ్బంది పడుతున్నారో? ఎంత

ఏడుస్తున్నారో?

హఠాత్తుగా వెనకతట్టునుండి 'ఝుం' మని శబ్దం వినబడింది సీతికి. వెనక తిరిగి చూసింది. పేసింజరుబండి. అతివేగంగా వస్తూంది. దానినిండా జనం క్రిక్కిరిసి ఉన్నారు. ఎంతోదూరంలో లేదుకూడాను. తప్పక అతిత్వరలోనే వస్తుంది. వంతెన దాటుతుంది. జీవకోటితోసహా గంగపా లౌతుంది. ఏమి చెయ్యడం? అన్ని ఆలోచనలూ సీతికి ఒక్కలిప్తలో తట్టినవి. ఎంత తెలివైన వ్యక్తి! ఎంత భూతదయ!

అన్నిప్రాణాల్ని రక్షించడానికి సీత తన ప్రాణమైనా పోగొట్టుకో నిశ్చయించింది. ఆ సాహసం! ఆ తెగింపు! ఆ భూతదయ! ఎవరికుంటాయి? కులము తక్కువైతేనేమి? పిల్లల్ని ఒక్కసారి తలచుకుంది. ప్రాణముల పై తీపివిడచింది. పోయిన భర్తని తన మనసార తలచుకుంది. అమాయకమై నిష్కల్మషమైన హృదయంతో దైవాన్ని ప్రార్థించింది. ఇటుఅటు వెఱ్ఱిగాచూసింది. ఏమి తోచలేదు. అట్టే ఆలస్యమైతే ఎన్ని ప్రాణాలు ఒక్కసారిగా మృత్యుగహ్వరాన్ని బడిపోతాయి. ఏమి చెయ్యడం? సీతికి పిచ్చెత్తినట్లయింది. ముందు వెనుక లాలోచించకుండా పరుగెత్తడం ప్రారంభించింది. మహాశక్తిలాగ విజృంభించి రైలుపట్టాల మధ్య నుంచి రాయనక, రప్పనక కోలయమునిలా వచ్చే ఆ రైలుకెదురుగా పరుగెత్తడం ప్రారంభించింది. ఎంత విచిత్రము! నొప్పి! బాధ, పిల్లలు, తాను, ప్రపంచం ...... ఒకటేమిటి? అన్ని మరచిపోయింది. రైలు నాపి ప్రజలని రక్షించడానికే తాను జన్మించినట్టుగా భావించింది. 'వంతెన పడిపోయింది. వారధి విరిగిపోయింది. రైలు ఆపండి' అంటూ అరవడం మొదలెట్టింది. వినిపిస్తుందా? ఘణఘణా శబ్దంలో కోకిల కూతని ధిక్కరించే ఆసీతి ఎలుగు వినిపిస్తుందా? అసలు రైలుకూతలోనే మనిషికూత వినపడదు. అందుకు తోడుగాలి హోరుమంటూంది. క్రమంగా ఒకరివై పొకరు వస్తున్నారు. ఉక్కుగుఱ్ఱంలాగ వస్తున్నది రైలు. వచ్చి వచ్చి పెఢిల్లని రైలు సీతిని ఢీకొన్నది. మరుక్షణంలో సీతి అగుపడలేదు. 'ఇన్ని ప్రాణాల్ని రక్షించేను. ఇక నాకు స్వర్గమే' అని చెప్తున్నాదనట్లు అంతరిక్షాని కెగిరిపోయింది. కాని రైలు జనంతోకూడ రక్షింపబడ్డాది! ఎవరివల్ల? ఒక్క అబల వల్ల!!! ఎంత తెగింపు! మృత్యుదేవతలా నోరు తెరచుకున్న ఆ వారధిలేని లోయకు ఇరువదియడుగుల దూరమున రైలు ఆగింది. ఆ ప్రజలసంతోషం! రైలును రక్షించిన వారిని చాలా స్తుతించేరు. ఏమి లాభం? విన సహ్యముకాని పిల్లలగోల! పాపము సీతి పిల్లలు! ఎంత ఏడిస్తే నేమిలాభం? పిల్లల విషయమై వేడెక్కిఉన్న సీతి ఒళ్లు, రక్తం చేత శాంతిపరచబడ్డది.

స్త్రీలు! అబలలా? కాదు కాదు. పోనీయండి. అబలలైనప్పుడే ఇంతటి ఘనకార్యాలు చేయగల్గితే సబలలైనప్పుడు ఇంకెంతటి పనులు చేయగలరో! ఈపాటికి భారతీయులకి స్వరాజ్యం వచ్చేయుండేది!

# రాణా ప్రతాపుని శపథము

శ్రీమతి జటావల్లభుల వెంకటరత్నమ్మగారు

రాజ్యమును బాసి దారాపుత్రాదులతో మహారణ్య మధ్యమున కష్టముల బడు చున్న ప్రతాపసింహుఁడు, తనతమ్ముడు శక్తసింహుఁడుగూడ అక్బరుపక్షముఁ జేరి మహాసైన్యసమేతుఁడై సలీము చక్రవర్తితోఁగూడ యుద్ధమునకు వచ్చుచుండె నని తెలిసి తన స్వల్ప పరివారములో కాళికాదేవి యెదుట జేయుచున్న ప్రతిజ్ఞ.

ఉ. వెంగలినాడు సోదరుఁడు వీడి తురుష్కుల పంచజేరినన్
పొంగిన సంద్రమోయనగ ప్రోగయిసైన్యము లెత్తివచ్చినన్
సంగరరంగమందురికి చచ్చెద మంతియెకాని, మాతృ దే
శాంగన పజ్జకేని కుటిలారుల జేరగనీయ, మీశ్వరీ!
అచ్చపు మాతృభక్తి, ప్రళయార్క మహోగ్ర నిరర్గళ ప్రతా
పోచ్ఛ్రయఖడ్గధార నరియోధుల కుత్తుకలూడ్చి యాజిలో
నిచ్చటి రాజపుత్ర బలమెంతయు జూపెదమంతెకాని, వె
న్నిచ్చితి మన్నదుర్యశము నెన్నడు బుట్టగనీయ మీశ్వరీ!
చేరు తురుష్కవాహినికి జేర్చినయక్బరు మాయకానికిన్
భారత రాజపుత్రబల పౌరుషధాటిని జూపి, గౌరవం
బారవిచంద్రతారకము నారనిరీతిగ జేతుమంతె కా
నేరికిలోంగి దాస్యమున కెన్నడునొప్పము నమ్ము శాంకరీ!
పోయిన రాజ్యముం దిరిగిపొందెడుభాగ్యము గల్గుదాక మే
మీయడవిన్ సుఖాన భుజియింపక తల్పమునన్ బరుండకే
రేయిబవల్ స్వతంత్రపద ప్రేరితమానస శక్తిచేతనే
మా యరులన్ జయింతు మనుమానము నొందకుమమ్మ శాంకరీ!
నీవయి నొట్టుబెట్టుకొని నిల్చితిమీవ్రత ఘోరదీక్షలో
ప్రాపుగ నుంటివేని పరిపంథిమహార్ణవ మంథనోర్జితా
శాపరిపూర్ణ నిస్తుల యశఃప్రభ నన్యులకెల్ల మార్గముల్
జూపి పరాశ్రితాత్మకుల శూరులబుద్ధి మరల్తు మీశ్వరీ!
సోదర పుత్రమిత్రతతి సుస్థిరభోగ విలాస సంపదల్
బూదిగనైనగాని, పరిపూర్ణ మనః పరిపాక పౌరుషా
రాధనచే స్వతంత్రమునకై యిదె జీవితమీయనెంచినా
మీదశజూచి మాయెడల నించుక సత్కృపనింపుఁ మీశ్వరీ!

# గాంధీజీ—స్త్రీ ప్రబోధము

కుమారి ప్రేమాకణ్టక్

ప్రపంచమొక రసాయనిక ప్రయోగశాల. ఇందు పరమేశ్వరుడు ప్రయోగముల జేయుచుండును. అతని సంయోజనము లద్భుతములు. సాధారణ మానవులు వానిని తెలియజాలరు. సర్వశ్రేష్ఠులగు గాంధీజీని సృష్టించిన దాది నేటివఱకెన్నియో చమత్కారముల భగవానుడు మనకు జూపెను. వారిద్వారా ననేక ప్రయోగముల ప్రదర్శించెను. నాదృష్టిలోమాత్రము వారొనర్చిన కార్యములలో కెల్ల మిన్న ఆది శక్తి యొక్క పునరుద్ధరణ. మనదేశమునందలి స్త్రీలలో నణగియున్న శక్తిని పైకిదీసి వారల జీవితముల సమగ్రము గావించుటకై ఆయనచేసిన ప్రయత్న మెంతయు శ్లాఘింపదగియున్నది.

సంఘమునందే పైన మార్పుగలుగ జేయవలెనన్న, స్త్రీల సహాయమవసరము అను నభిప్రాయము సాధారణముగా పురుషులకు లేదు. సంస్కరణలో స్త్రీజాతికి ప్రవేశము లేక పోవుటచేతనే సంఘసంస్కరణ ప్రయత్నములు విఫలమయ్యెనని నేటివరకుగల ఇతిహాసము తెలుపుచున్నది. అన్నివిధములను స్త్రీలను నీచముగా తలంచు పురుషులు తమ పనులలోగల చిక్కులను కొంచెముగా గ్రహింపగల్గిరి. సంస్కరణవాతావరణము విస్తృతిజెందినకొలది, నిపుణులైన పండితులు ఈ విషయమును ముఖ్యముగా తెలుసుకొనజొచ్చిరి. వాటినుండియే స్త్రీలకు సంఘసేవ యొనరింప నవకాశము గల్గెను.

భారతమహిళలు అనాదిదుఃఖము, అనంతసుఖము అను స్వప్నజాలములలో చిక్కుకొనియుండిరి. కొందరు సంస్కర్తలు స్త్రీ విద్యాప్రచారమునకై పాటుపడుచుండెడివారు. కాని స్త్రీల జీవితమును సమగ్రమొనరించు దృష్టి వారికి లేకుండెను. నిజమేమన, స్త్రీలను తమతో సమానముగా చూచు ప్రయత్న మెవ్వరును చేయలేదు. స్త్రీ విద్య కేవలము నాగరికతాలక్షణమును ఈ మాత్రోపయోగమునకై యుండెను. పాశ్చాత్య సంస్కృతియొక్క అంధానుకరణకూడ నిందే యుండెను. కావుననే నేడించుమించు నూఱు సంవత్సరములైనను విద్యావతులైన స్త్రీల సంఖ్య నూటికొక్కటికూడ తక్కువగా నున్నది. (.75% మాత్రమే.)

పాశ్చాత్యదేశపు స్త్రీలు స్వాతంత్ర్యమునకై పోరాటమొనర్చు ఆందోళన సాగించు సమయములో మన హైందవస్త్రీలు ఉత్సవములు మొదలగు సామాన్య కార్యకలాపములలో మునిగి తేలుచుండిరి. బహుళసంఖ్యాకులు ఉదరపోషణకొరకో, తమ వారి కొఱకో పాటుపడుచుండిరి. విద్యావతులైన కొద్దిపాటి స్త్రీలు మాత్రము దేశసంచార మొనర్చుచు తీఱిక సమయములలో సంఘసేవ చేయుచుండిరి. అవకాశము లేకుండుటచే నేమి, కొంచెము అయిష్టత, మఱియు అభ్యాసము లేనికారణముచే నేమి క్లిష్టములైన ప్రపంచ సమస్యలను విడదీయు తీవ్రమైన ఆకాంక్ష ఎవరియందునా కలుగలేదు. జీవితమునందు నూతనవిధాన మెవరికిని దొరకలేదు; ఎవరునుకూడ దానికొఱకు ప్రయత్నించనూ లేదు.

ఈ విధముగా నెంతో కాలము గడచెను. దేశములో చాలమంది నాయకులు పొడచూపిరి. దేశము నంతను కలవరపరచునట్టియు, జీవితలో పరిపూర్ణ పరివర్తన కలుగజేయునట్టియు, సౌభాగ్య మెవరికిని కలుగలేదు. కాని తిమింగిలము తనతోక విదలించుట

తోడనే సముద్రములో కల్లోలము సంభవించు విధమున, గాంధీజీ పాదము మోపినంతనే దేశమంతటను ప్రబోధరూపమగు కల్లోలము వ్యాపించెను. "నక్షత్ర మండలమునుండి ఒకానొక శుభ్రగ్రహము తన అదృశ్య మహిమవలన ప్రకాశకిరణములను భూమిపైకి చేర్చుటకు ప్రయత్నించుచున్నదో" అనునట్లు, దేశ కార్యముల మాత్రమును గాంధీజీ చేదాల్చినంతనే ఎల్లెడ నద్భుత పరివర్తనము కలుగజొచ్చెను. అప్పటివరకును ప్రతిష్ఠగల ఆచారములన్నిటిలోను అలజడి కలిగెను. శాంతిసదనమొక క్షణములో సమరభూమిగా మారెను.

గాంధీజీ దేశమునంతకును 'సమానత' సందేశమును వినిపించినప్పుడు, ఆనిష్పు రవ్వలలో కొన్ని మహిళా సమూహములలో పడెను. "మనలో కూడ చాలినంత శక్తియున్నది. మన మబలలము కాము. పురుషులతో బాటు మనముకూడ సంపూర్ణతకై వలయు పనులను చేయ గల్గుదుము." ఇవి యువిదల తలంపునకు వచ్చెను.

'ఉత్పాదన మపత్యస్య, జాతస్యపరిపాలనమ్' అను మను వాక్యమును ప్రాచీనకాలమునుండియు స్త్రీలు స్వధర్మముగా నెంచియుండిరి.

గాంధీజీ మహిళావర్గమునకు స్వాతంత్రముయొక్క ప్రకాశమును చూపించెను. "స్త్రీ తప్పక వివాహము చేసుకొనవలయుననుట మిథ్యాభ్రమ. ఆజన్మబ్రహ్మచర్య మొనరించుట కామెకు సంపూర్ణమైన హక్కు గలదు." అని ఆయన నొక్కి వక్కాణించెను.

మొన్నటివఱకు తన సంసారముయొక్క సేవతప్ప ఇతరములైన సంఘసేవలను వాంఛించుటకూడ ఏదేశములోను స్త్రీ జాతికి మంగళప్రదముగా భావింపబడి యుండలేదు. కాని గాంధీజీ ఇట్లు తెల్పెను—"సార్వజనిక కార్యములలో స్త్రీల భాగము పురుషులతో సమానముగా నుండవలెను. మద్యపాన నిషేధము, పతితస్త్రీ సముద్ధరణ మొదలగు పనులలో స్త్రీలే అధికమైన సఫలతతో పాల్గొనగలరు" గాంధీజీ సేవా ధర్మమును బాగుగా వ్యాప్తమొనరించెను.

ప్రాచీననాయకులకు స్త్రీ సమస్యలపై అట్టి ఆకర్షణ లేకుండెడిది. వారికి రాజనీతిలో ఎక్కువ ఆనందము కల్గుచుండెడిది. వారి రాజనీతి కేవలము వాగాడంబరములోనే ప్రవహించుచుండెను. వారి కార్యకలాపము సభాసమ్మేళనము కోర్టు, మఱియు అసెంబ్లీవఱకే. అట్టిచో సోదరీమణులకు సేవయొక్క అవసరమెట్లు తెలియును? పురుషుల కార్యములలో స్త్రీల కేపాటియు సమరాగము లేకుండెను. విద్యావతులు కూడ అరుదుగానుండిరి. భళా! ఈ రాజనీతి కార్యములో స్త్రీలెట్లు పాల్గొనగలరు?

గాంధీజీనీతిలో గ్రామోద్ధరణ మొదలుకొని సత్యాగ్రహమువఱకు నిమిడియున్నవి. స్త్రీల కిందులో వలసినంత పనియున్నది. తమశక్తులన్నియు వారుప యోగించు కొనగల్గిరి. స్త్రీస్వాభావికధర్మమగు అహింసాధర్మపు పునాదిపై మహాత్ముని రాజనీతిస్థాపింపబడినది. కావున నా క్షేత్రమున సులభముగా స్త్రీలకు అధికారయుక్త ప్రవేశము కల్గెను. అన్నితరగతుల, అన్నిజాతుల స్త్రీలును, మూఢత్వమను తెరను తొలగించుకొని, ఈనూతన నాందోళనములో ప్రవేశింప గల్గిరి. వారిజీవితములోని అశాంతి విడిపోయెను. గాంధీగారి సమత్వసందేశము స్థూలపరిస్థితిని ఛేదించుకొని, స్త్రీల హృదయములలో ప్రవేశించెను. గాంధీ గారిట్లు చెప్పిరి— "స్త్రీజాతిని ఈర్ష్యాదృష్టితో జూచుట హిందూసమాజముయొక్క దురలవాటై యున్నది. ఇది ధర్మము కాదు. స్త్రీ అబలకాదు. ఆమె తనశక్తిని తానుచక్కగా నర్థము చేసుకొన్నచో పురుషునికంటె బలవతియగును. స్త్రీజాతిలోనిశక్తి ఆమెయొక్క విద్వత్తులేక శరీరబలమువలన కలిగినది కాదు. ఆమెయొక్క అనంతమగుశ్రద్ధ, భావోద్రేకము, అపూర్వమగు త్యాగశక్తివలననే అట్టిశక్తి ఆమెకుగల్గినది.

స్వభావసిద్ధముగా నామె కోమలత్వమును, ధర్మభీరుత్వమును గలది. మరియు నెచ్చట పురుషుడు శ్రద్ధను గోల్పోయి సోమరియగునో, అచ్చట స్త్రీ ధైర్యముతో తనమార్గము ననుసరించి నడచుచున్నది.”

స్త్రీ పురుషులను వేఱు వేఱు క్షేత్రములలో నియమించురీతి ఈ దేశములో సాధారణముగ నుండెను. స్త్రీని మాయలాడి యని నుడివెడివారు. స్త్రీ మోసముతోగూడిన యొక వస్తువుగా పురుషులను గోచరించుచుండెడిది. గాని సార్వజనిక కార్యములలో స్త్రీజాతికి ప్రవేశము కల్గిననే వాతావరణము పవిత్రము కాగలదను సంగతిని గాంధిజీయే మొట్టమొదట తెల్పిరి. స్త్రీల అహింస పురుషుల క్రూరత్వమును తొలగించి వారికి కోమలత్వ మొసంగును. అంతియ కాక స్త్రీలు తమ భీరుత్వమును వదలి నిర్భయమును, సాహసమును అలవర్చుకొందురు. ఈ విధమైన అమరఆశతో గాంధిజీ స్త్రీ పురుషుల నొకరివద్దకు నొకరిని తెచ్చి వారి జీవనమును సంపూర్ణ మొనరించుటకును, సామాజికతంత్రమును స్వాభావికమును, సముజ్వలమును చేయు నభిప్రాయముతో నూతనప్రయోగము నారంభించెను.

నేడు స్త్రీలకు ఒక క్షేత్రమైనను మూయబడలేదు. వా రెంత ఉన్నతినైనను పొందవచ్చును. అన్నిటిలో వారికి పురుషులతో సమానమగు హక్కుగలదు. వారు తమ తపస్సు, సాహసము, సేవ, వీనివలనకూడా ఇట్టి పరిస్థితిని పొందగల్గిరి. గాంధిజీ ప్రేరేపణ, వారి మహాత్వ, గౌరవముల సహాయము, కల్గనే కల్గినది. గ్రామహిమను బాగుగా తెలుసుకొని గాంధీజీ ప్రబుద్ధ స్త్రీజాతియొక్క శక్తిని గ్రహించి దానికి ముందున కడుగువేయు నవకాశము కల్గించెను. ఆమె సేవను గౌరవించెను.

నేడు స్త్రీలందరు గాంధీజీకి ధన్యవాదము లర్పించుచున్నారు. తమలో గల్గిన క్రాంతియొక్క శ్రేయము చాలభాగము ఆయనదే నని వారు తలంచుచున్నారు. నా సంచారములలో దూరప్రదేశములందుండు గ్రామీణ సోదరీమణులతో నాకు సంభాషణ జరిగెను. నే నెన్నియోసార్లు వారల నోటినుండి ఈ మాటలను వింటిని—“మేము వంట,వడ్డనలలోనే మున్గి తేలుచుంటిమి. నేడు గాంధీగారి ద్వారా నవజీవన దర్శనము మాకు కల్గినది. మాలో నూతనవికాసము కల్గెను. మేము పీన్గులవలె నుంటిమి. ఆయన ఊపిరి పోసి మాలో నవజీవమును వికసింపజేసిరి. కావున మేము వారి కెంతయు కృతజ్ఞులము.”

సత్యమును దర్శించుటకు అహింసను సాధనముగా గొనిన మహాత్మజీ అహింస బ్రహ్మచర్యముపై నాధారపడియున్నదని తలచుచున్నారు. “నా ధర్మము బ్రహ్మచర్యమును పాలించుట, పాలింపజేయుటయై యున్నది—వివాహమును, ప్రజావృద్ధిని నేను అనిష్టముగా నెన్నుచున్నాను. అయిననూ నా ఆదర్శము వేఱు. ఏది అనివార్యమును, సర్వాంశమునుండియు అనిష్టము కానిదో అట్టి కార్యమునందు భోగములను తగ్గించుకొనుట, త్యాగము నభివృద్ధి నొందించుకొనుట, బుద్ధిమంతుల కర్తవ్యము” అని గాంధీజీ వ్రాసియున్నారు.

తన సిద్ధాంతముల నిలబెట్టుకొను దీక్షయు, ఇతరుల వశము చేసుకొను అపూర్వశక్తియు గాంధీజీలో నున్నవి. వీనివలన వారు తన ఆదర్శములను వ్యతిరేకించువారల తనవశము చేసుకుని వారల జీవితములో నున్నతిని కలుగజేసెదరు. ప్రపంచ స్త్రీలందరిపైనను వారి కొకే విధమగు పవిత్రప్రేమ గలదు. స్త్రీ స్వయముగా ఉన్నతి పొందవలయునని వారు కోరుచున్నారు. తమ యౌవనములో స్త్రీని భోగ్య వస్తువుగా తలంచిన గాంధీజీ ఉగ్రతపో మననముల వలన నేడు ఇంకొక నిశ్చయమునకు వచ్చియున్నారు. పురుషజాతియొక్క అహంకారము నేడు వారి హృద

మచిలీపట్టణము లేడీస్ రిక్రియేషన్ క్లబ్బులో
1938—వ సంవత్సరములో జరిగిన పోటీ ఆటలలో టెన్నిసులో గెలుపొంది
రోలింగు కప్పును శాశ్వత కప్పులను బహుమానముల పొందినవారు.



శ్రీమతి దుల్ల వెంకటరమణమ్మగారు
(క్లబ్బు కార్యదర్శిని)

శ్రీమతి వట్టూరి సుమిత్రాదేవిగారు
(క్లబ్బు గేమ్సు కార్యదర్శిని)

యమునుండి వెడలినది. మరియు భార్యను మాతృ స్వరూపమున జూడగల మార్పు గల్గెను. స్త్రీ, జగన్మాత, జగత్సోదరి గావలెనని వారాశించుచున్నారు. స్త్రీయొక్క త్యాగవృత్తి పతిపూజలోనే పరిణతి నొందుచున్నది. పత్నీత్వ మావశ్యకమే, కాని దాని నెరవేర్పుకొన నావశ్యకము లేదు. ఏమన, దానిలో వికృతిశాంతికి వీలున్నది. జగత్సోదరి యగుట కష్ట సాధ్యము. స్వభావసిద్ధముగా బ్రహ్మచర్యము, సేవా భావము పూర్ణముగా గల్గినట్టి స్త్రీయే సోదరి కాగలదు. స్త్రీలను సార్వజనిక కార్యములలో ప్రవేశింపజేసిన గాంధీగారు తమ బాధ్యతను మఱువలేదు, వారు స్త్రీ దాక్షిణ్యతయొక్క పక్షపాతి మాత్రమే కాదు. స్త్రీ నిజముగ కర్మచారిణి కావలెననియు, తన బాధ్యతలను గురుతింపవలెననియు, ఆదర్శసేవికయై తన ఉజ్వలచరిత్ర తపస్సులచే సంఘమును పవిత్రముగా చేయవలెనని వారు నిత్యమును కోరుచున్నారు. సాధనశుద్ధిపై జీవితవికాస మాధారపడియున్నది. సాధనశుద్ధి తపస్సంయమముల వలననే కల్గుచున్నది. స్వాభావికముగా స్త్రీ త్యాగమూర్తి, సేవాశీలయై యున్నది. దానిని ఫధఃకరించి వికారశూన్యయయి పవిత్ర వాతావరణమును కలుగజేయవలయును; ఇదియే గాంధీజీ మనస్త్రీలను కోరునది.

ఆంధ్రీకరణము—భావరాజు రాజరత్నమ్మ,
(రాష్ట్రభాషా విశారద్)

## 'చలోక్తి'

శ్రీ పువ్వుచిట్టి వేంకటసుబ్బారావుగారు

రామ సీతమ్మతోడ నారామనృపుడు
పోలతి దమయంతిగూడి యా నలవిభుండు
చంద్రమతితోడ నాహరిశ్చంద్ర నృపతి
పడతి ద్రౌపదితో పంచపాండవులును
కలసినాతోడ కొన్నాళ్లు మెలసితిరిగి
వాసిగన్నారు దురపిల్లవలదు మీరు
నాదుపేరన్న ? దారిద్ర్య మండ్రునన్ను.

* * *

వారిననసేల మీరు నావారుకార ?
వాస మీదేశమందునే జేసినాను
రూప రాహిత్యనయ్యును ప్రాపునిడుదు
నీచకార్యేచ్ఛ గొల్చినా నీతిగూర్తు
నష్ట కష్టాలద్రోసియు నాదరింతు
నిచటగాకున్న నటనైన నిత్తు సుఖము
జీవినాచేత సుఖదూర జీవియగును
నాదుపేరన్న ? దారిద్ర్య మండ్రునన్ను.

పాపగిరినాదు ప్రజల పాపాలకొండ
యేడుసంద్రాలు నాసఖులేమ్ప నీరు
నగ్ని నాస్నేహితుల హృదయాగ్ని సుతుడు
నెన్ని యవలక్షణాలైన యున్నవైన
నాదుమిత్రులు దుఃఖాంత మందబోరు
అందిరా ! స్వర్గసంవాసు లన్నమాట !!
నేల భయమంద నాచెల్మి కేమిలోటు
నాదుపేరన్న ? దారిద్ర్య మండ్రునన్ను.

* * *

రాజులైనను వైభోగ రాజులైన
త్యాగులైనను సర్వ సత్యాగులైన
నాదు సంపర్క మందక లేదుముక్తి
కూడవచ్చిన ముక్తి ముంగొంగుపసిడి
యేల జిజ్ఞాసయింకను చాలునింత
నాదుపేరన్న ? దారిద్ర్య మండ్రునన్ను.

# అంటరానితనం-భారతదేశం

ఎ. సు.

ఈప్రశ్న మనదేశాన్ని అట్టుడికించుతూ వుంది. అంటరానితనం గురించి అనేకమంది చర్చించుకుంటూ శిఖపట్లవరకు కలహిస్తున్నారు. అథర్వవేదంలోనుండి ఆధారాలు చూపేవారు కొందరు, ఆపస్తంభసూత్రాలనుదహరించేవారు కొందరు, మనువును మన్నించేవారింక కొందరు, భగవద్గీతను పాటించువారు పలువురు, ఈవిధంగా "అహం" అంటే "సోఽహం" అంటూ అసలు జరుగవలసిన కార్యక్రమాన్ని వెనుక వేస్తున్నారు. శాస్త్రచర్చలతోనే కాలం వెళ్లబుచ్చడం కనబడుతోంది కాని, మహాత్ముని అభిప్రాయానుసారంగా నిర్మాణకార్యక్రమంలో ఈసమస్యను జతపరచి దానికి సఫలత్వం చేకూర్చడమునకు పాటుపడే వాళ్లు నూటి కెందరోలేరు.

ఈ భయంకరసమస్య ఈరోజుల్లో విడదీస్తేనే దేశానికి కళ్యాణప్రాప్తి—దేశీయులలో నైకమత్యవ్యాప్తి—స్వాతంత్ర్యసమరానికి విజయలాభం సంభవం—ఇప్పుడుపేక్షించితే మున్ముందు దీనివలన భారతదేశానికి కలుగబోయే తీరని నష్టం వర్ణనాతీతం అంటే చాలును.

ఇది సార్వజనీనమైన సమస్య అనాలి. దీనికి మతాలు—ఆధునిక మతాలు అడ్డుతగలవు. పురాతనులు ఇందుకు అంగీకరించరు. దేశ కాల పరిస్థితుల్ని అనుసరించి ఈ అంటరానితనం తనంతట తానే అన్ని జాతుల మధ్యనుండి తొలగిపోతూవుంది. ఆహితాగ్నుల సంతానములు ఆంగ్లవిద్యాభ్యసనం చేసినపుడే ఈ అంటరానితనం బ్రాహ్మణ్యం నుండి తొలగిపోయిందని ఊహించాలి. పాశ్చాత్యులు సమస్త విభాగాలకు అధికార్లు కావడంతోడనే అంటరానితనం అడుగంటిందనే నిశ్చయానికి వచ్చితీరాలి. కాఫీక్లబ్బులు విస్తరించినప్పుడే ఈభావం దూరంగా తొలిగిపోయిందని చెప్పాలి. నీళ్ల కుళాయిలు, రైలుమార్గాలు మొదలగునవి తెరువబడినపుడే ఈభేదం నశించినదని అనుకోవాలి.

బహుపురాతనకాలంనుండి అమల్లోవున్న ఈ జన్మసిద్ధభేదభావం నానాటికి తనంతతానే మాసిపోతూవున్నప్పటికీని ప్రత్యక్షంగా అంటరానివారిని తాకడం అంటే గుండెలు పగులునట్లు గోలపెడుతున్నారు సనాతనులు. మనం మన దృష్టులు వెనుకకు మళ్లించి చూస్తే ప్రాచీనచరిత్రలలో వర్ణవ్యవస్థను పుణాదిగగల ఈ భేదభావం రచింపబడినట్లు తోచదు. గ్రంథస్థములైన ఉదాహరణలను చూపి "ఇకనైనా ఈభావం విడవండి" అని నామమాత్రపు ఆహితాగ్నులను బ్రతి

మాలితే "వీటితో మాకు ప్రయోజనంలేదు. "శాస్త్రాత్ రూఢిః బలీయసీ" అని వితండ వాదానికి దిగుతున్నారు. లోకోక్తులను ఉదాహరించితే శాస్త్రాల శరణు దూరుచున్నారు. ఈలాటి పరిస్థితుల్లో మన దేశ నాయకుల ప్రాణాలు విసిగి ప్రభుత్వం వారితో పోరాడి అంటరానివారికి కొన్ని సుఖువులు చూపెట్టారు. ఇక ప్రభుత్వాజ్ఞలను జవదాటడమునకు వీలులేదు; ఐనా చట్టాలమూలంగా సనాతనుల వాగ్బంధనము సంభవమైనది గాని, వారి ఆంతరంగిక అభిప్రాయాలు ఈ సంస్కారంవైపు జోగ లేదనే చెప్పవలసివస్తూవుంది. ఇది ఎంతో దుఃఖదాయకవిషయమని అందరు ఒప్పుకొనకతీరదు. బ్రాహ్మణులే అనండి, ఇంకొక తెగవారే అనండి, మొత్తముమీద "విద్య" దాని పఠనము, అధ్యాపనము అనే క్రియలు ఒక తెగవారికి వశమైపోవడంచాతను, తదితర తెగలవారు విద్యాభ్యసనంవైపు దృష్టి మళ్లించుకొనజాలకపోవడంచాతను, మనలో మనకుగల తెగవుల పరిష్కారానికై మనం మధ్యవర్తుల అండజేరవలసివస్తున్నందుకు ప్రతిభారతీయుడును విచారించవలసిందే!!

ఈభేదం పవిత్రమైన భారతజాతిలో ఏలాగు సంక్రమించిందో తత్కారణం దురూహ్యం. ఏదో ఒక దుర్ఘటనవలన దీనికి మన జాతిలో అంకురార్పణం సంభవమైంది. దీన్ని దేశంలోని మూలమూలల నుండి తొలగించి, వ్రేళ్లతో పెల్లగించి రూపుమాపితేనే మనం ప్రస్తుతం జరుపుతూవున్న స్వాతంత్ర్యసమరానికి విజయం సంభవమౌతుంది! మన జనాభాకు చెందిన కొన్ని కోట్లమంది మన దేశంలోనే పుట్టి, మనవలెనే జన్మపొంది, మనవలెనే రక్తమాంసపురీషాదుల గలిగియున్నపుడు, మనకు గర్హితములైన నీచాతినీచపు పనులు నిర్వర్తిస్తూ మన కెంతో ఉపకారం చేస్తున్నపుడు వారిని మన సంఘాల్లోనుండి విడపెట్టడం, వారికి మనకున్న హక్కుల్లో కొన్ని అయినను ప్రసాదించకపోవడం ఘోరం కాదూ? అమానుషం కాదూ?

చేతులార మనవాళ్లని మనమే ఇతర మతాలవారికి అప్పగిస్తున్నాం. ఇది చూసి ప్రపంచంలోని ఇతర ఖండాలవాళ్లు నవ్వుతున్నారు; మన సోదరీసోదరులనే మన మూర్ఖత్వపు టవకాశం తీసుకుని తమ మతాల్లో చేర్చుకుంటున్నారు. మతం భిన్నం కాగానే మనవారు మనలను మరచిపోతూవున్నారు. మతాభిమానంతో సహా మన పైన వారికిగల అభిమానం మాయమవుతూవుంది. మన సంఘం బలంతప్పి క్షీణిస్తూవుంది. ఇతర దేశాల్లో చూడండి ఈభేదం ఏలాటి హద్దులోవుందో? వాళ్లలోకూడా ఇంకొకరూపంతో ఈభేదం వున్నప్పటికిని, సాధారణ సమస్యలలో దేశం ఏకం కావలసి వచ్చేటపుడు రోడ్లు తుడిచేవారు చీపుర్లు వదలి, కమ్మరి కుమ్మరులు తమ పనిముట్లు విడిచి, కాపులు కంబారులు కావళ్లుజార్చి, నోబుల్సు, కామన్సు, లార్డ్సు అందరూ "హోలో"మని ఏకమై ఆయా సమస్యల

గురించి చర్చించుకుంటారు, పరిష్కరించుకుంటారు. మనమో ఈ సమానతకు తావే ఈయకున్నాము.

వర్ణవ్యవస్థ గుణవృత్తుల ననుసరించిగాని జన్మచాత ఏర్పడలేదని రూఢిగ "దయానందుడు" వక్కాణించాడు; చివరకు తన ప్రాణాలు ఈ సమస్యకొఱకే ఆహుతి గావించుకొన్నాడు. ఆతని అనుచరు లెందరో ఈ సమస్యగురించి ఇప్పటికిని పడరాని పాట్లు పడుతున్నారు. ఈవిధంగా మనం ఎందరనో దేశహితైషులను, ఎందరనో సంఘసంస్కర్తలను దిగమ్రింగినాము. నేడు కూడ మన భేదాభిప్రాయం పూర్తిగ విడువలేకున్నాం.

ఇంతయేల. మన శాస్త్రాలే ఒకటితో ఒకటి ఒప్పకున్నాయి. అదే శాస్త్రకారుడు ఒకచోట "వద్దు"ని వ్రాస్తాడు. వేరొకచోట "కూడును—ఔను" అని లిఖస్తాడు. సాధారణులు దేనిని విశ్వసించాలో తెలియక చికాకుపడతారు. ఆ శాస్త్రిల్లో గల "మంచి"ని మనం గ్రహింపకున్నాము. "చెడ్డ"ను స్వీకరిస్తున్నాం. మన మత గ్రంథాలు—మనకు ఏకమాత్రైశ్వర్యాలైన వేదాలను విశ్వసింపకున్నాము.

"నవిశేషోఽస్తి వర్ణానాం సర్వం బ్రాహ్మమిదం జగత్" అని "భృగు" వుదహరించినదానిని మనం అంగీకరింపకున్నాము.

"శక్తేనాపి హి శూద్రేణ నకార్యో ధన సంచయః" అని మనువాక్యము. దీని ననుసరించి శూద్రాదులకు ఏలాటి హక్కులు లేకుండ అణగద్రొక్కుతున్నాము. పైగా ఎంతదూరం పరుగెత్తి పోయినప్పటికిని,— "చతుర్థ ఏకజాతిస్తు శూద్రోనాస్తితు పంచమః" అను స్వర్ణాక్షరాలే మనకు గ్రంథములలో గోచరిస్తూవుంటే ఈ "పంచమ" శబ్దం ఏలాగు పుట్టిందో తెలియదు. ఈ భేదానికి.........(1) భాష (2) ఆహారం (3) ప్రాంతీయత (4) వృత్తి; ఈ నాలుగే కారణాలు.

కారణా లేలాటివైనను మనం ఈనాడు వాటిని మరిచిపోయి "సమానీప్రపా సహవో అన్నభాగః" అను వైదికోపదేశాన్ని మననంచేస్తూ జాతిభేదం విస్మరిస్తే దేశాన్ని బాగుచేసినవారమగుదుము. లేదా ఇంకొక శతాబ్దం గడిచినప్పటికి మనకు మానసిక శుద్ధి లభించదు. మానసికశుద్ధి లభిస్తేనే గాని పూర్ణస్వాతంత్ర్యం మానవజాతికి లభించడం దుర్లభం.

# శ్రీమతి సుబ్బరాయనుగారి బిల్లు

## ౧

### పురుషులకే ఉపయోగము

శ్రీమతి పాలూరి సత్యకుమారిగారు

శ్రీమతి రాధాబాయి సుబ్బరాయన్ సతిగారు, సెంట్రల్ అసెంబ్లీలో బహుపత్నీ నిరోధకశాసనము నుపపాదింప నున్నారు.

5 సం॥ పైబడి భార్యాభర్తా ఒకరినొకరు విడిచియుండిరని రుజువైన పురుషుడు పరిహారమీయకయె పునర్వివాహాధికారము బొందుననియు నిందుగలదు. యీ బిల్లు స్త్రీలకన్న పురుషులకే చాల ఉపయోగముగ నున్నది. భార్యయందు యిష్టము లేనిచో యేదో ఒకవంక బెట్టి పరిహారమీయ నిష్టములేక పుట్టినింటికి భార్యను పంపివేసిన 5 సం॥లైన పిమ్మట ననాయాసముగ వివాహమాడవచ్చును. అప్పుడు యీ బిల్లు ఆతనికి వర్తింపదు. దుష్టపురుషునకు భార్యను అయిదుసంవత్సరములు వదలియుండుట కష్టమైన పనికాదు. భర్తచే విడువబడి, ఎట్టి ఆస్తియులేక ఆ స్త్రీ చేయునది ఏమి? కాన పరిహారమీయ నక్కరలేదనుట చాల అన్యాయముగా కనబడుచున్నది. అదియును గాక మనదేశమున స్త్రీలు భర్తను వదలి వివాహమాడ నిచ్ఛగింపరు.

ఇష్టమున్ననూ వారి యవ్వనము కొలదికాలములోనే ఇంటటి భర్తవద్దనే వసించిన ఆమె పోషించు వారెవరు? సాధారణముగా మనదేశములోని స్త్రీలకు 25 సంవత్సరములకే (?) మనుమలు పుట్టుచుండుట మనము చూచుచున్నాము. అప్పుడామెకును, భర్తకును, చెడినదనుకొనుడు, భర్త ఆమెను విడిచి మరియొక స్త్రీని వివాహమాడెననుకొనుడు. అప్పుడు యీ అమ్మమ్మ నెవరైననూ వివాహమాడుదురా? నను పరిణయమాడుమని ఆమె యడుగగలదా? అట్టి పుట్టింటివారు ఎవ్విధమైన కట్నమును యివ్వనిచో భర్తకెట్టి ఆస్తిగాని లేకున్నచో, నీమె ఏమి చేయవలెను. ఈ బిల్లు ఆమె కెటుల సాయపడును? కావున ఆస్తిలేక, భర్త జీతగాడైన యడల జీతమునుండి 3-వ వంతు భార్యకు యిప్పించిన బాగుగా నుండును. బిడ్డలున్నచో వారిపోషణ భారమంతయు భర్తయే వహించయుననికూడ శాసించవలెను.

## ౨

### పురుషుల కవకాశమీరాదు

శ్రీమతి కాకులపాటి రాధాసుందరమ్మగారు

ఇందు 5 సం॥లు కుదురని జబ్బుచే భార్య బాధపడుచుండిన భర్త ద్వితీయవివాహమాడ వచ్చుననుట సమంజసముగ లేదు. ఏలన అట్లు ద్వితీయవివాహమాడ దలచిన దుష్పురుషుడు 5 గాదు 10 సం॥లైనను భార్యజబ్బుకు సరియైన మందు యిప్పించక ఆమె దీర్ఘ సంకటపరురాలగునట్లే చేయును. భర్త సత్పురుషుడైనచో నిజముగా నామె వ్యాధి కుదురనిదేయైనచో ఆమె యిష్టమును దీసికొనియే పెండ్లా

డును. గనుక యీ నిబంధన బిల్లునం దుండరాదు. దీని నుంచినచో పాడవని యెద్దునకు పోట్లు నుప్పి నట్లై అనేకులు ఇష్టములేని భార్యలను చావమోది ఆమె జబ్బుపడినచో సెట్లో యీ 5 ఏండ్లు గడపి విడచి పెట్టుదురు. అప్పుడామె గతియేమి? ఇక "5 సం|| అన్యోన్యప్రేమ లేకుండిన" అను విషయము కూడ బాగులేదు. ఆరవసంవత్సరము గ్రహములు మారి అన్యోన్యప్రేమ కలిగి వారు సుఖింపకూడదా? "1 సంవత్సరము ఇతర సంపర్కము కలిగియున్న" అనుటలో పురుషునకు ప్రస్తుతము లైసెన్సు యిచ్చియున్నందున స్త్రీ రుజావు చేసుకొనజాలదు. ఇక స్త్రీ విషయమై పురుషు డిట్టి అపవాదు తెచ్చుట కవకాశ మిచ్చుట మిక్కిలి విచారకరము. శీలవతియగు హిందూ స్త్రీ యెన్నడట్లు చేయదు. చేయనివారికి చేయుసేర్పుటయే యగును. కనుక ఇదియు బాగులేదు.

"దేహారోగ్యము చెడినను" అనగా, చెడినప్పుడు చికిత్స చేయింపవలెను గాని విడిచిపెట్టుదురా?

"ఒకరివలన ఒకరికి ప్రాణహాని కలుగునప్పుడును" అన్నప్పుడు తప్పక విడిపోవలసినదే. ఎందుకన మూర్ఖులగు భార్యగాని, భర్తగాని తన యర్ధశరీరముసే కోసుకొన నుద్యుక్తులైనపుడు విడిగానుండి పరమావధిని సాధించుకొనుటే యొప్పును. ఇట్టితరి భర్తవలన భార్యకు తగు పరిహార మిప్పింపబడవలెను. భార్య దుండగముచే భర్త పీడవలసి వచ్చుచో కోర్టువారు విచారించి దానిధర్మమున దానిని పరిహారమివ్వకయే తొలగింపవచ్చును. ఆ పిమ్మటనైన నది సద్వర్తన కలిగియుండ జేర్చుకొన నవకాశముండును. "భార్య యొక్క అస్వస్థతవలన భర్త విడాకులు కోరుచో" అన్న మాట కూడ బాగులేదు. అట్టి నానుగులకే పురుషుల కవకాశ మివ్వకూడదు. అట్లైన వారు జబ్బుతో నున్న భార్యలను సరిగ జూడరు.

ఇవి అన్నియు విమర్శించిచూడ సుబ్బరాయన్ సతి బిల్లు నీ క్రిందివిధముగ సవరించిన బాగుండునని నా యుద్దేశము.

"భార్య జీవితకాలములో భర్తయు, భర్త జీవితకాలములో భార్యయు ఒండొరుల అనుమతి లేనిది ద్వితీయ వివాహమాడరాదు. కాని ఒకరివలన ఒకరికి ప్రాణహాని కలుగ నున్నదని ప్రబల సాక్ష్యమున్నపుడు సివిలుకోర్టులో పిటీషన్ పెట్టి విడాకులు పొందవచ్చును. అప్పుడు ఆ స్థితిని బట్టి కోర్టువారికి యుక్తమని తోచు పరిహార మిప్పింపవలెను. దంపతులలో నెవరైన మానని అంటువ్యాధిచే పీడింపబడుచున్న యెడల రోగి గౌరవముగ జీవింపజాలినంత పరిహార మిచ్చి విడాకులు పొందవచ్చును. భార్య అనుమతితో భర్త ద్వితీయ వివాహమాడి ఆమెను తిన్నగా చూడనిచో తొలిభార్యకు తాను ద్వితీయవివాహమాడు నాటికున్న నగలన్నియును, ఆమెకు ఆమెబిడ్డలకును తన యావదాస్తిలో సగభాగమును ఇచ్చి విడాకులు పొందవచ్చును. ఆస్తి యేమియు లేక నిత్యబత్యము తెచ్చుకొను కూలివాడుగాని, జీతగాడుగాని అయినచో తెచ్చుకొనుదానిలో సగభాగ మామె కిచ్చుచుండవలెను."

## 3

## మహోపకారము

శ్రీమతి జరుగుమిల్లి రామాబాయమ్మగారు

శ్రీమతి సుబ్బరాయనుసతి ధర్మమాయని, అందరును నిశ్చింతగానుండవచ్చును, యావజ్జీవము స్త్రీలు నిర్భయముగా బ్రతుకవచ్చును. తల్లితండ్రు పిల్లకు సుఖముండదని ఎటులనో సొమ్మును సమకూర్చి

అల్లునకు కట్నమిచ్చి వివాహము చేసి పిల్లను కాపురమునకు పంపిన, తమబిడ్డ ఎంతయో, సుఖపడునని గంపెడు ఆశతో నుండు సమయమున, వాని కేదో దుర్బుద్ధి పుట్టి మామగారు గొప్పగాయున్నచో, "కారు" ఇవ్వమనియో, లేక ఇంకొకటి కోరియు, ఇవ్వకున్న, పిల్లను వదలివేసెదనని బెదరించి, చివరకు భార్యను విడచి వేరొకపిల్లను పెండ్లియాడి ద్రోహము నెవర్చుట మనము కనులార చూచుచున్నాము. ఇటీవలననే గౌరవకుటుంబమునకు చెందిన ఒకయువకుడు మామగారు తనకు లండనుపోవుటకు సొమ్ము ఇవ్వలేదని ఆ పిల్లనువదలి పెద్దలు ఎందరుచెప్పినను వినక పోలీసు బందోబస్తుతో వివాహమాడెను. ఇట్టి అన్యాయమును తొలగించి దేశమునకు ఈచట్టము మహోపకారము గావించును. ఇట్టి చట్టములున్నగాని ఆశాపాతకులగు భర్తల అత్తమామల దౌర్జన్యము, నిర్దయ, పాపభీతి రాహిత్యమును తొలగవు. సంఘము బాగుపడదు. ఈ చట్టమున్నచో దుష్టులు జంకకమానరు. అప్పుడు ఆడబిడ్డలకు కొంత శాంతి సుఖము లేర్పడగలవు. ఈ చట్టమును శాసనసభ్యులందరును ఇండియా అసెంబ్లీలో ఏకగ్రీవముగా ఆమోదించి నారీలోకముయొక్క కృతజ్ఞతను చూరగొనెదరుగాక. సంఘమునకు ఈ చట్టమున్నగాని, భర్తల నిరంకుశత్వము, అక్రమము, దయారాహిత్యము అడుగంటవు. ఎన్ని కుటుంబములు లోలోపల భర్తల అక్రమముచే కృంగి కృంగి క్రుగ్గిపోవుచున్నవో ఆ పరమాత్మునికే ఎరుక. ఈ బిల్లును తెచ్చిన సుబ్బరాయను సతిగారికి సభ్యులందరును చేయూత నొసగెదరుగాక.

## ౪

## హెచ్చరిక

### శ్రీమతి పంగులూరి రాజ్యలక్ష్మమ్మగారు

శ్రీమతి రాధాబాయి సుబ్బరాయన్ సతిగారు పెట్టనున్న 'బహుపత్నీవివాహనిరోధపు' బిల్లు విషయముపై సోదరీమణుల అభిప్రాయము కావలసియున్నది. అందుకొరకు ఇదివరకే గృహలక్ష్మి మనకొరకు దండోరా వేసియేయున్నది. కాని మన స్త్రీసంస్థలు నిద్రనుండి మేల్కొని మన భవిష్యత్తు ననుసరించి జరగబోవు పనిని చక్కగా ఆలోచించి ఈ పత్రికాముఖంబున తెలియపరచుట అవసరమైన పనియైయున్నది. ఈబిల్లులో (4) (ఏ) సెక్షన్ ప్రకారము 5 సంవత్సరముల కాలము రోగము నయము కాని హేతువువలన రెండవ వివాహము చేసికొనవలసివచ్చినప్పుడు పురుషునికి ఆస్తిలేనిచో ప్రథమ భార్యను పోషించు బాధ్యతతో రెండవ వివాహమునకు కోర్టువారు అనుమతి ఇవ్వవలెను అని ప్రత్యేకముగ ప్రొవైజో (2) కలుపబడెను. ఏలననగా ఎట్టి ఆస్తిలేక రోగపీడితులయిన అనేకమంది స్త్రీలు కలరు. వారలలో చాలామందికి రోగమునకు ముఖ్యకారణము వివాహము, అందువలన సంభవించు కాన్పులు. ప్రస్తుతము అట్టిస్థితులలో సంఘకట్టుబాట్లకు లోబడిఅయినా పురుషుడు బిచ్చమెత్తి రోగపీడితురాలగు భార్యను ఏదోవిధముగ పోషించుచున్నాడు. ఇకముందు చట్టముప్రకారము అట్టి బాధ్యతలేకుండా రెండవ వివాహమునకు అనుమతి పొందినచో రోగపీడితురాలగు ప్రథమభార్య గతి అతికష్టమగును. మనదేశములో అట్టి దిక్కులేనివారి పోషణార్థము ఎట్టి వసతులున్నూ సర్కారువారివలన గాని, సంఘమువలనగాని ఏర్పాటు చేయబడియుండలేదు. బిల్లులోని మిగతా విషయములన్నీ మనకు అనుకూలముగ నేయున్నవి.

# పురుషులకే వర్తింపవలెను

శ్రీమతి డి. భారతీదేవిగారు

శ్రీమతి రాధాబాయిగారి బిల్లువలన దేశములో నపుడే యాందోళన ప్రారంభమైనది. ప్రస్తుత మీ బిల్లు "బహుపతి బహుపత్నీ నిరోధక శాసనము" అని వ్యవహరింపబడుచున్నది. పై పేరును చూడగనే యీ చట్టము విడాకులచట్టములో నవినాభావ సంబంధ మేర్పరచుకొనుచున్నదా? యను సందేహము గల్గును. విడాకులచట్టమములలోనుండి బహుపతులను బొందుచున్న పద్ధతి హిందూ స్త్రీలలో నున్నప్పుడే గదా బహుపతి నిరోధన శాసన మవసర మగునది? స్త్రీ వితంతూద్వాహమే నిషేధింపబడు నీ దేశములో బహుపతి నిరోధనశాసన మెందులకు? స్త్రీలుగూడ పురుషులబోలె యిచ్చవచ్చినట్లనేక వివాహము లాడుచున్నచో న్యాయమే గాని యిపుడీ బిల్లు హాస్యాస్పదముగ నున్నది. కావున "బహుపతి" యను మాటను తీసివేసి "బహుపత్నీ నిరోధకశాసనము" అని వ్యవహరించుట సమంజసము. యిది స్త్రీలకు వర్తింపజేయరాదు. కేవలము పురుషులకే వర్తింపజేయు టుచితము. వ్యాధిచే బాధనందెడు వారికి యౌషధసేవనముగాని యారోగ్యవంతులకు కాదు గదా? సంతానవతి గాదనియో, మామగారు కోరిన ద్రవ్య మొసంగలేదనియో, రూపవతి గాదనియో స్వల్పకారణముల పురస్కరించుకొని భార్యల విడనాడి వారి నిక్కట్టుల బెట్టుచున్నవారు పురుషులే గాని స్త్రీ లెవ్వరును పురుషుల నిట్టి కష్టముల పాల్జేయుట లేదుగదా?

ఈ బిల్లు స్త్రీల కుపయోగకారి యైనట్లు గన్పట్టుచున్నను పురుషులకు లాభకారిగా నున్నది. యిదివరలో నే కారణముచేత భార్యను వదలినను యామెకు మనోవర్తి నొసంగవలసిన బాధ్యత భర్తకు గలదు. యీ బిల్లువల్ల నిక నా బాధ తొలగి సులభముగా భార్యను త్యజించుటకు మార్గ మేర్పడుచున్నది. యిందులో చేర్పబడిన నిబంధనలే వీటికి కారణము. యీ నిబంధనలు చాలా సంకుచితముగా నున్నవి. అయిదేండ్లు వ్యాధిపీడితయగు భార్యను విడనాడుట పురుషులకు సులభమే గాని అయ్యది మెచ్చుకొనదగిన యుత్తమకార్యము గాదు. అయిదేండ్లు గాదు పది పన్నెండేండ్లు వ్యాధిపీడితలై తదుపరి యారోగ్యము బడసి సంతానవతులైన స్త్రీ లెందరో గలరు. అట్టి సందర్భములలో నామెను విడనాడుట న్యాయమని యెవరేని చెప్పగలరా? హిందూధర్మశాస్త్ర మట్టి యక్రమ కార్యమున కొప్పుకొనలేదు. యిక స్త్రీల విషయ మాలోచించినచో నే భారతయువతియు పై కారణమువల్ల భర్తను విడనాడ సాహసింపదు. రోగగ్రస్తుడై యున్న భర్తను మిగుల శ్రద్ధతో యుపచరించును గాని వివాహము రద్దు గావించుకొని వేరొకనిని చేపట్ట దలచునా?

కం॥ నడువడి కొఱగాన్నను
బడుగైన కురూపియైన పామరుడైనన్
జడుడైన రోగియైనను
విడుచుట మర్యాద గాదు విభు నంగనకున్.

యనెడి యార్యధర్మము ననుష్ఠించెడి భారతస్త్రీల విషయములో నీ మినహాయింపు మిగుల హాస్యాస్పదమే గదా? అయితే స్త్రీ లెల్ల రిట్టి ధర్మానుష్ఠానతత్పరులేనా? యని ప్రశ్నింపవచ్చును కాని ముప్పాతిక మువ్వీస మట్టివారు గలరని చెప్పుటలో నతిశయోక్తి లేదు. యిక నితరుల విషయమై చెప్పు

సక్కురయే లేదు. అట్టివారు ఉత్తమశ్రేణిలో చేర్చ నర్హులుగారు గదా? అట్టి స్వేచ్ఛా విహారులకే చట్టము నిర్బంధింపలేదు. యే శాసనము సరిదిద్దలేదు. పాపభీతి లేనివారికి చట్టభీతి యేల? ఇక రెండవది యైదేండ్లు వరుసగా భార్యను విడనాడియున్నచో నామెను శాశ్వతముగా వదలివేయవచ్చును. అపుడామె కేమియు నష్టపరిహార మీయ నక్కరలేదు. ఇందటిదానికంటె మరీ వింతగ నున్నది. అయిదేండ్ల వియోగమాత్రముననే దాంపత్యము పరిత్యాజ్యమగుచో హిందూ వైవాహికాచారమే నిందార్హమైనట్లు భావింపనగును. విద్యార్జనకై యే యింగ్లండో అమెరికాయో వెడలి కొన్నిసంవత్సరములు తిరిగి రాకుండ నుండి వచ్చిన దనరాకకై నిరీక్షించియున్న భార్యను విడచివేయుట యెట్టి నీతి? నిరంకుశాధికారులగు పురుషులు కొందరు భార్యయెడ నిజమైన ప్రేమ లేక నిష్కారణముగా నామెను బాధించుచు అయిదేండ్లు విడిచియుండి తదుపరి యే విధమైన నష్టపరిహార మీయకనే వివాహము రద్దు గావించుకొనవచ్చును. అట్టివారి విషయములో నామెకు తగిన ధనము నొసంగి రక్షణ నొసంగునట్లు బిల్లులో సవరించుట ముఖ్యమగు విషయము. స్త్రీల విషయము ఆలోచించినచో పై స్వల్పకారణమును నిరూపించుచు ఏ హిందూ భార్యయు తనకై తాను స్వయముగ భర్తను విడనాడుటకు సివిల్ కోర్టు ద్వారా వివాహము రద్దు కావించుకొనుట కిచ్చగింపదు, ఇక C, D గుర్తులు కల కారణముల వల్ల భార్యను విడచుట కెట్టి పరిహారములేదు. ఆ విషయమై ఏ విధమైన ఆక్షేపణ చేయబడదు. ఈ రెండు గుర్తులు గల కారణముల వల్లను స్త్రీలు భర్తలను విడనాడ ప్రయత్నించినచో విఫలులౌదురు కాని సఫలులు కాలేరు. వ్యవహారదక్షులగు పురుషులు ఏ విధమైన కూటసాక్ష్యముచేనైనను మిగుల కష్టతరమైన కేసులుకూడ సులభముగ తప్పుకొనగలరు. కావున, వారు స్వల్పవిషయమును బుజావుపరచినట్లు, స్త్రీలు ప్రబల కారణమైనను బుజావు చేయలేరు. వారి కట్టి అవకాశములు చాలినన్ని కలవు. స్త్రీలకు ఈ విషయమై సరియైన సాక్ష్యముకూడ లభింపదు. కాన స్త్రీల కేమియు లాభములేదు. ఇట్టి కారణములవల్ల ఈ బిల్లులో క్రిందను కనుపర్చిన సవరణ కావించుట అవసరము.

1. అనారోగ్యకారణముచేత అయిదేండ్లు కాని, పదేండ్లు కాని భార్యను విడనాడకోరరాదు. ఆ క్లాజు తొలగింపవలెను. అయిదేండ్లు వరుసగా భార్యను వదిలియున్న కారణమున ఆమె కేమియు నష్టపరిహారమివ్వకయే వివాహమును రద్దుచేసికొని పునర్వివాహాధికారమును పడయుటకు నిరాకరింపవలెను.

ఇట్టి మార్పులతో బిల్లును ప్రవేశపెట్టి వెంటనే అమలుకూడ జరిపినచో అనేక స్వల్పకారణములవల్ల భర్తలచే విడనాడబడి అనదలై అల్లాడుచున్న స్త్రీలోకమునకు రక్షణ ఏర్పడును. అట్టి అల్లుళ్లచే పీడింపబడుచున్న మామగార్లకుకూడ రక్షణ గల్గును.

## ౬

## సవరించాలి

### శ్రీమతి కందర్ప కమలకుమారిగారు

శ్రీమతి రాధాబాయి బిల్లునందు చూపబడిన కారణము లేకనే ద్వితీయవివాహమాడు పురుషునికి ఆ పురుషుని పెండ్లాడే స్త్రీకిని ఆమె తల్లిదండ్రులకు లేక పోషకులకు శిక్ష విధించేలాగున చేయాలి. ఏ స్త్రీయు 5 సం॥ వ్యాధికి లోనైయుండుట అసంభవము. ఒకవేళ అట్లున్నను భార్య సుఖదుఃఖములలో

పొల్గొనని భర్త ఎందులకు? ఆమె సుఖమును మాత్రమే అనుభవించి విడచుటకు ఆమె నిర్జీవప్రతిమ గాని, జంతువుగాని కాదు. భార్యయు భర్తయు ఒకరి కష్టసుఖములలో ఒకరు తోడుగానుండ వలయుననియే మన హిందూధర్మము చెప్పుచున్నది. ఒకరికొకరు తోడువారైయుండనిచో అట్టిది దాంపత్యమే కాదు. ఇంతకు భార్యయు భర్తయు ఒకరి నొకరు అర్థముచేసుకొనలేకనే ఇట్టి చిక్కులు వచ్చుచున్నవి. అట్లు అర్థముచేసుకొన్నవారల సంసారములు చాల ఆనందముగను సుఖముగను వెళ్లును. కాని ఏ స్త్రీఅయిన కుష్టు, మొదలగు వ్యాధులకు లోనైనచో అట్టిస్త్రీకి తగిన పరిహారమిచ్చి ఆమె అనుమతికూడ తీసుకొని తిరిగి వివాహము చేసుకొన వచ్చును. 5 సం॥ జబ్బుగానున్నంతమాత్రమున ఆమెను విడచి తిరిగి వివాహము చేసుకోవచ్చునని బిల్లునందున్నచో పునర్వివాహమాడే పురుషునికి ఈబిల్లు వర్తింపదు. పునర్వివాహము చేసుకొనతలచు పురుషునికి 5 సం॥ భార్యను విడచియుండుటొక కష్టముకాదు. 5 సం॥ జబ్బుపడినంతమాత్రమున పునర్వివాహము చేసుకొన్నచో తిరిగి ఆమె ఆరోగ్యవంతురాలయిన ఆమె గతి ఏమి? 5 సం॥ కుదురని రోగముచే బాధ పడుచున్న స్త్రీగాని పురుషుడుగాని 5 సం॥ అన్యోన్య ప్రేమలేకుండిన 1 సం॥ ఇతర సంపర్కము గలిగిన దేహారోగ్యము చెడినగాని ఇరువురులో నెవరైన విడాకులిచ్చుటకు కోర్టులో అర్జిపెట్టుకొనవచ్చును. కోర్టుద్వారా ఆమె నగలు ఆమె కందజేయబడును. ఒకవేళ ఆమె తల్లిదండ్రులు బీదవారైనందున ఆమెకు ఏమియు పెట్టక పోవచ్చును. ఆమె అందమునుచూసి అతడు వివాహముచేసికొని అందము తనివితీరాగ్రోలి ఆమెను అనారోగ్యవతిగాచేసి తిరిగి తన బాధ్యత కోర్టుద్వారా తీసివేసుకొన తలచుచో ఆమె గతి ఏమి? అతను ఉద్యోగిఅయిన మూడవవంతు ఇచ్చునట్లు చేయాలి.

## ౨

## దీర్ఘరోగములకే వర్తింపవలెను

శ్రీమతి భూపతిరాజు వెంకమ్మగారు

5 సంవత్సరములు రోగపీడితురాలైన పునర్వివాహమునకు ఈచట్టము అనుకూలించునని చెప్పుట శోచనీయము.

ఒక దాంపత్యమున భర్తగాని భార్యగాని రోగియైన ఒకరిమీద మరియొకరు విరక్తిపెట్టుకొని పునర్వివాహమున కవకాశమిచ్చు రీతి శాసించుట న్యాయముకాదు. వివాహము భోగవిలాసముకొరకు మాత్రమే కాదు. తల్లిదండ్రులు తమ బిడ్డలకు ఈడు వచ్చి లోకపరిజ్ఞానము కుటుంబవ్యవహార కార్యనిర్వాహకత కలిగిన తదుపరి వివాహము చేయుచున్నారు. వారు ఒకరికొకరు సన్నిహితస్నేహముతో నుండి ఒకరికి వచ్చు కష్టములు మరియొకరు నివారించుకొనుటకొరకై సహాయము చేయవలెను. కొంతకాలమునకైనను రోగియగు తనభార్య రోగనివారణయై తనకు అన్నివిధముల తోడ్పడుటకు అవకాశమున్నను భర్త శాసనముద్వారా సహనశక్తి కల్పించుటకు బదులు వానిని నిరుత్సాహపరచుటకు అవకాశమిచ్చు శాసనము ఏల? రోగనివారణయగుటకు అవకాశము లున్నప్పుడు భర్తయే పునర్వివాహము చేసుకొనిన భర్తకంటె తక్కువ బాధ్యతగల బంధువు లెవరు ఈమెకు రోగనివృత్తికి సహాయపడుదురు? కాన రోగనివృత్తి కవకాశములున్న రోగియగు భార్యను వదలి పునర్వివాహమాడుట కవకాశమిచ్చుటకంటె దీర్ఘవ్యాధులు (మూర్ఛ, కుష్టు మొదలగునవి) ఉన్నట్లు

తెలియనివ్వకుండా వివాహము చేసినట్లైన అసమయములందు మాత్రము పునర్వివాహము చేసుకొనుటకు అవకాశములుండవలయును. అటువంటి రోగులను కూడ తప్పక ప్రభుత్వమే తన ఆధీనమందుంచుకొని నివారణకై ప్రయత్నించుచుండవలయును. ఏపురుషుడు గాని ఏస్త్రీగాని వివాహమయినది మొదలు చనిపోవువరకు రోగితో జీవించుట కష్టము. దీర్ఘ రోగితో నిరుత్సాహజీవితము విషాదకరము కనుక అసమయములందు మాత్రమే విడాకులచట్టము అవసరము. ఇదివరకు ఎన్ని చట్టములున్నను వ్యభిచార నిర్మూల చట్టము, లంచగొండినిర్మూల చట్టము ఉండినగాని స్త్రీలకు లాభములేదు. స్త్రీలకు పురుషులు సహాయముచేయరు. స్త్రీల కష్టాలు చెప్పకొనుటకు కోర్టుకు వెళ్లితే పోలీసులు సబిన్స్పెక్టర్లు న్యాయాధికారులు లంచాలు పుచ్చుకొనుట మానరుగాలు చేయుట నిందలు మోపుట పరిపాటైపోయినది. అందుచే స్త్రీలు పురుషుల సహాయములేనిదే కోర్టులకు వెళ్లరు. కష్టాలతో జీర్ణించిపోతున్నారు. ఆత్మహత్యలుకూడ చేసుకొనుచున్నారు.

కావున వ్యాధివిషయమున 5 సంవత్సరములు కాల పరిమితి తీసివేసి భార్య దీర్ఘవ్యాధి పీడితురాలైనచో ప్రభుత్వము బాధ్యత తీసుకొని విడాకుల కనుజ్ఞనివ్వవలెను.

కొంతమందికి వివాహమైన తరుపరివారిలో వారికి అభిప్రాయ భేదములు కలిగినను అనేక ఇక్కట్టులకు పాల్పడుచు జీవితమును గడుపుకొనుచుందురు.

"దాంపత్యములో ఇద్దరకు అభిప్రాయభేదములు కలిగి ఇక్కట్టులకు పాల్పడు జీవితము గడుపుటకంటె ఒండొరుల ఇష్టప్రకారము తగు పరిహారమిచ్చి విడాకులు పొందవచ్చును" అని మార్చుటకూడ మంచిది.

౧

## ఈ చట్టమెలా వుండాలి?

శ్రీమతి పాకల రాజామణెమ్మగారు

ఇందులో కొన్ని మార్పులుండాలి. ఏమంటే (1) భార్య ఐదుసంవత్సరాలు రోగిగా వుంటే, (2) ఐదుసంవత్సరాలు భార్యాభర్తలు విడదివుంటే, (3) సంవత్సరమునకు పైగా వ్యభిచారులైవుంటే, (4) ఆరోగ్యానికిగాని, భద్రతకు గాని, భంగంకలిగించే క్రూర ప్రవర్తన కలిగివుంటే సివిల్ కోర్టులో రుజువు పరచి వేరే వివాహానికి అధికారం తీసుకోవచ్చు. (1) వ గుర్తుకు మాత్రం భర్త, భార్యకు పుట్టింటివారి కిచ్చిన కట్నం, నగలు, తన ఆస్తిలో మూడవవంతు ఆమెకు స్వాధీనం చెయ్యాలని వుంది. కాని తక్కిన వాటి కవి లేవు. ఈకాలంలో పెండ్లై ఒకబిడ్డ తల్లి అమేటప్పటికే రోగిష్టులవుతున్నారు. ఆ రోగాలు ఆ జన్మాంతంకూడా వుంటున్నాయి. కొన్ని రోగాలకు భర్తలే కారకులవుతున్నారు. అలాంటప్పుడు నిర్దయగా వేరేవివాహం చేసుకోవడం న్యాయమా? వివాహమాడ దలచినవారి కది కారణమవుతుంది. మన భారతస్త్రీలలో దీర్ఘరోగులుగానో, వంధ్యలుగానో వుంటే వారే నావల్ల మీకు సుఖంలేదు. వేరే పెండ్లి చేసుకోండని భర్తలని బలవంతపెట్టేవాళ్లున్నారు. ప్రాణం పోయేటప్పుడు భర్తను మళ్లీ పెళ్లిచేసుకోమని చెప్పే సాధ్వీమణులున్నారు. అటువంటప్పుడు వాళ్లని కష్టపెట్టడమెందుకు? క్షయ, కుష్ఠుమొదలైన నివారణకాని అంటువ్యాధులైతే వాళ్లని ఆదరించి తగిన సదుపాయాలు చేసి వివాహమాడవచ్చును. పురుషుడిలాంటి రోగాలు కలిగివున్నప్పుడు స్త్రీకూడా పై విధంగా చేయవచ్చునని బిల్లులో నున్నది. కాని యే

భారత స్త్రీ కూడా, చట్టమున్నా భర్తను త్యజించ లేదు. ఇక విడచివుండట మనేది అనేక కారణాల వల్ల జరగవచ్చు. పరిత్యజించ దలచిన భర్త యొక్క కారణాలు నిరూపించి చెప్పవచ్చు. కాని స్త్రీ తన నిర్దోషిత్వాన్ని రూఢిపరచలేక పోవచ్చు. అప్పు డామె గతియేమి? భర్త ఎంత అన్యాయం చేస్తున్నా కిక్కురుమనకుండా రెండో కంటివారికి తెలియకుండా భరించే మానవతు లెంతమంది లేరు. పురుషుడెంత సాహసమైనా చేయగలడు. స్త్రీ చేయ లేదు. స్త్రీలలో మాత్రము భర్తయం దిష్టములేక, భర్తతో కాపురంచేయక పుట్టింట్లోనే వుండి వ్యభి చారిణి యని పేరుబడ్డ స్త్రీలు లేరని కాదు. ఉన్న నూటి కొక్కరు దొరుకుతారు. అటువంటి నడవడి గల స్త్రీని నేరము రుజువైనచో పరిత్యజించవలసి నదే. కాబట్టి దుర్వృత్తివలన గాని, భర్తయం దిష్టం లేక కాపురం చేయక గాని విడచి వున్నట్లైతే న్యాయాలయం ద్వారా రెండవపెండ్లికి అనుజ్ఞ తీసు కోవచ్చును (1) వ గుర్తునందు సూచించిన కట్నం, నగలు ఆమెకు స్వాధీనం చేయునట్లు సవరింపవలెను. భార్యనొల్లని భర్తలు వేరొక స్త్రీతో భార్య చూచు చుండగానే సంతోషిస్తూవుంటారు. ముద్దుగా యింటి యందొక స్త్రీతో కాలక్షేపం చేస్తూవున్నా ఆభర్త కుకూడా భార్యను పరిత్యజించి యన్యవివాహం చేసు కొనే భర్తకు వర్తించు న్యాయసూత్రాలే వర్తించ వలెను.

స్త్రీలందరు ధైర్యంతో పట్టు విడువక శ్రీమతి రాధాబాయి సతీమణికి సహాయం చేయవలెను. సమస్త భారత స్త్రీలను వుద్ధరించే చట్టం కాబట్టి స్త్రీలందరూ వుపేక్షించక ధైర్యంతో కార్యరంగానికి వురకాలి.

శ్రీమతి యం. శకుంతలా దేవిగారు

# కోకిల

గీ. స్వాగతంబును నీకును నల్పుచున్న
గున్నమామిడి యందును గూరుచుండి
కోకిలా నీవు పాడగ గొంతునెత్త
దన్మయంబగు నుల్లముల్ తాండవించి.

గీ. పెంచువారల బుద్ధులే పిల్లలకును
గలుగుననుటను నక్షరాల్ గల్ల జేసి
గాయకుండవే గాదులే కవివిగూడ
పాడు దవ్యక్త భాషలో పాటలేమొ.

గీ. అందమంతగ లేదని యడలకమ్మ
వేద జడుడట లేవమ్మ వెఱ్ఱిబమ్మ
గుణములే కద లోకముల్ గొనును నిజము
గొంతు సవరించుకొనుమమ్మ కోకిలమ్మ.

గీ. చిగురుదొడగిన మామిడి చెట్టు నీకు
బరగ సింహాసనంబై ప్రాఢి మెరయు
సాటిలేకుండ రాజ్యము సాగనిమ్మ
యెవరి వ్రాతల దెలియగా నెవరితరము.

# కాశ్మీర మజిలీలు

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు

(చీకటిలో మహాప్రళయము)

అంతవఱకు వడవడ వడకించు చలి ఏమైనదో! రొట్టలోని వెచ్చందనము మనసున కాముహూర్తమున నెంతో సుఖముగొలిపినది. త్రోవలో ఎంతో హైరానుపడి వచ్చితిని కావున నిమిషములో నిద్రపట్టినది. ఎంతసేపు నిద్రించియుంటినో ఎఱుగను. ఇంతలో అరుగు పొంత ఏదో కేక వినబడినది. నిద్దురలో గుండె నది చీల్చినది. చివాలున లేచి నిలిచితిని. ఎదుట నేమియుఅగపడలేదు. వికృతశబ్దముచేయుచు అరుగుమూల రొట్టలో బుడంకాయి దొరలుచున్నాడు. కేకవేసినది వాడై యుండడు. ఏదో బొబ్బవినియే భయముతో వాడు మూలమూల పొరలుచున్నాడని గ్రహించితిని. బోండా ఎదుటి అరుగుపై నిద్రించుచునే యున్నాడు. మఱెవ్వరును నాకందు కనుపింపలేదు. "ఏమిరా?" అని పిచికిని కదపితిని. నేను వానిని కదపుటయు, మరల వెనుకటి కేక వినబడుటయు నొక్క పర్యాయమే జరిగెను. "బాబారే!" అని అఱచుచు బుడంకాయి నన్నుగట్టిగ బట్టుకొనినాడు. వాని పట్టునుండి విడలించుకొనుటకుముందు మరల బొబ్బ వినబడినది. "భూత్! భూత్!" అని అఱచుచు రొట్టలో తలదూర్చికొని వాడు మూలనక్కినాడు. మరల కేక! బోండాగాని మఱెవ్వరు గాని లేవలేదు. అరుగుమీదినుండి క్రిందికి దుమికి నలువైపుల దేఱిచూచితిని. ఎవరో వ్యక్తి మెల్లమెల్లగా కొంతదూరమునుండి నడచిపోవుచున్నాడు. కేకవేయుచున్నది వాడే యనియూహించుచుండగా ఆతడు బొబ్బపెట్టినాడు. పదియడుగులువేసి అతడట్లు అఱచుచున్నాడు! వాడెవ్వడై యుండునో! దొంగకాదు కదా! దొంగయైనయెడల అఱచుచు నేలపోవును? అందందు నిముసముసేపు నిలుచుచు, ఇండ్లను పరీక్షించుచు మరల వాడు కదలిపోవుచున్నాడు. గస్తితిరుగువాడని గ్రహించి, సంగతిని పిచికితో చెప్పి "భయములేదు పరుండు"మని ఆ దౌర్భాగ్యునిగుండె దిటవుచేసితిని. నిమిషములో వాడు మరల నిద్రించినాడు. దొంగయైనను వానికంత అడలెందులకో! వానికడ మూటముల్లెలు మాత్రమేమున్నవి?

మరల నరుగుపై చేరితిని. కాని నాకిక నిద్రపట్టినదికాదు. క్రిందికిదిగి పచారుచేయుచు నైశదృశ్యమును పరికింపసాగితిని. మరల శబ్దమేమియు వినబడలేదు. కొంతసేపు శిథిలమైన నిస్తబ్దత మరల దొంటిస్థితినందినది. తమతమ తావులందు అష్టదిక్కులు నిద్రించినవి. అంతరిక్షమునుండి ఏదియోపక్షి సుషుప్తి మగ్నమైయున్న విశ్వసామ్రాజ్యమును

పరీక్షించుచు నెగసిపోయినది. నిశాకాంతఆయూరును తన యూరువున జేర్చి, జోకొట్టినది. ఇండ్లదాపుననున్న చెట్లు అప్రమత్తులై నిలిచిన పారావాండ్రవలె తోచినవి. అనంతశాంతి! పరుండిన పుడమిసొంపును, సొరును నింగినుండి చుక్కనెలంతలు రెప్పలువాల్పక చూచు చున్నవి. మానసమూని అనిమేష లోచనములతో బరిశీలింపగలవా రెట్టి విజ్ఞానము నంద గలరో! చుక్కల దృష్టాంతములు జిజ్ఞాసువుల కెట్టి మేలిబంతులుకావు? ఒక్కచూడ్కి నవనిమీదను వేఱొకచూడ్కి నంతరిక్షముమీదను నిబద్ధమొనరించినిలిచినపుడు హృదయ మానందపూరితమైనది. కడలేనిశాంతి మానసమునవిడిసినది. జలచరముల కదలికనెఱుగని కాసారమువలె పెరతలపుల స్పర్శనందక నాశాంతి విరాజిల్లుచున్నది. ఆహా! ఆనందమున కును, అనంతశాంతికిని ఎట్టి చుట్టఱికముకలదో! వీనిని తనమనసున నిముడ్చుకొనిన చిత్తము సుధాకలశముపోలునదని వచింతును. అమృతముపై దోమలు వ్రాలజాలనట్లట్టి మానసమున దుశ్చింతలు వ్రాలజాలవు.

ఆ ముహూర్తమందే జగదీశుడు రమాసతిగూడి జగతియందు విహారముచేయ నవ తరించును గాబోలు! కన్నుల బడకున్ననేమి భగవతియు భగవంతుడును సమీపమందే కలరని సమీరమందత్తఱికలుగు అపూర్వసంచలనమే చెప్పక చెప్పునుగదా! ఆహా! సర్వేశునకును, సమీరునకును నెట్టి నేస్తముకలదో! ఇరువురును అదృశ్యులే! కాని మనుజ నకు ఆయువులైనవారును, మానవ హృదయమున నద్భుతభావసృష్టి గావించువారును వారిర్వురే! హిల్లోలతరంగములం దీదుకొనివచ్చు దివ్యబాలలనై సుందరభావము ప్రవేశ మభిలషించి హృదయకవాటమును తట్టును. వ్రతనిష్ఠకై పూజాగృహమునజొచ్చు గృహిణి వలె, కమలాకరమున తలముంచి గభీరధ్యానమున నాత్మవిస్మృతయగు పద్మినివగిది, మధుర ముహూర్తమున శయ్యాగారమున బ్రవేశించు నగుమోము యిల్లాలులీల, ఎవ్వరులేని యదనుగని తీపిగుసగుసలందు వింతకబురులు తెలుప దివినుండి దిగివచ్చిన అచ్చరనెచ్చెలి పోలుపున బూర్వోక్తభావము హృదంతరాళమునజొచ్చి ఆ మంగళముహూర్తమున నెంత హాయిగొలుపదు? కవిచంద్రులకును, మునిచంద్రులకును, మిగులగూర్చు ముహూర్తమది! వీరి నెయ్యమును, వియ్యమును కాంక్షించి భూతలమున వీరినిగలయ స్వర్గమవతరించు శుభముహూర్తమది!

అరుగుమీది స్తంభమున కానుకొని కూర్చుని రెప్పవాల్పక నిశ్శబ్దమైనదృశ్య మును పరిశీలించుచు, మనసున తనంతతాను తలసూపు భావసృష్టికతన ననల్పమైన హాయినందుచుంటిని.

అపుడెదుటి యరుగుపై నిద్రించుచున్న బోండా ఎవరితోనో పోరునట్లు పలవించి రెండుమూడుతూరు లిటునటుదొరలి గుఱ్ఱుపెట్ట నారంభించినాడు. క్రమక్రమముగ నది

హెచ్చుస్థాయినందినది. సరిగ నా నిమిషమందే లోపలినుండి గుఱ్ఱువినబడినది. ఈతడును ఇంటిలోని యాడువారిర్వురును ముందుగనే కూడబలుకుకొని అప్పుడప్పుడు గుఱ్ఱుపెట్టుచుందురు కాబోలు! స్వప్నసృష్టిని చాలించి స్తంభముకడనుండి కదలి, మరల రొట్టెపై నొడలు వాల్చితిని. నిరంతరాయమైన శబ్దము మనసునకు బాధ కలిగించునదేయయ్యు వినికికి నలవడుననియు పదపడి విరమించినపుడే అది యుండెనను భావము మనసునకు తట్టుననియు మనశ్శాస్త్రమున చదువుకొంటిని. తెల్లవారువఱకు నీవింతశ్రుతి ముగియదని తలచితిని; కాని మొదటివలె నది చెవిని బాధించినదికాదు కొంతసేపటికి పాపము గుఱ్ఱు అడగినది. ఆముగ్గురు మరల గాఢ నిద్రబడియుందురు. మరల యోచనలో బడితినిగాని యోచన ఈమాఱు నిద్దురలోనికి దారిదీసినది. మరల నేదియో భయంకరశబ్దము వినబడినది. గూబపై నెవ్వరో గట్టిగ చఱచినట్లయ్యెను. "శ్రీహరీ!"యని చివాలునలేచి నిలిచితిని. క్రొత్తవారెవ్వరు అగపడలేదు గాని కొంపలో గగ్గోలు అధికమైనది. "హా! హా!" అని యఱచుచు, ఎంతోకష్టముతో బోండా లేచినాడు. అరుగుమీాల బరుండియుండిన బుడంకాయి చివాలునలేచి, కనులుమూసికొని పోయిపోయి ఏలకో బోండాపై పడినాడు. ఒకరితో నొకరు వీరావేశముతో పోరుచున్నారు. లోనున్న స్త్రీలును ఇట్లే డీకొనినట్లు వినవచ్చు అఱపులవలన విశదమగుచున్నది. మనుష్య శబ్దములేకాక మఱేవో వికృతశబ్దములు లోపలినుండి వినబడుచున్నవి! కొండొకవడి నిలిచినచోటునందే త్రొట్రుపడియుంటిని. ఈ యాకస్మికభీషణ సంఘటనము స్వయంభువువైన బడబాగ్నివలె నేల విజృంభించుచున్నదో? ఏదో విభీషిక గృహమధ్యమున, పుట్టినని మెలకువచ్చిన మరుక్షణమున గ్రహింపగలిగితిని గాని, అదెట్టిదో తెలియరాలేదు! ఒకపరి కొంపనడుమ చిచ్చంటుకొనినదనియు, ఇంకొకపరి వన్యమృగమో క్రూరసర్పమో పెనుభూతమో, భయంకరదస్యుడో సదనమున ప్రత్యక్ష యమలోకమును సృష్టించుచున్నదనియు యోచించి ఒక్కదాటున గుమ్మముదరికి ఉఱికి బలముకొలది తలుపుతట్టితిని. శబ్దమునకు లోపలి యల్లరి మఱింత యధికమైనది! తలుపు నెవ్వరును తీయలేదు. దానిని గట్టిగ బిగించి ఏదో రక్కసి ఒక్క రొక్కరిని నమలి మ్రింగుచున్నది కాబోలు! ఇటు బోండా బుడంకాయలు పెనగులాడుచు అరుగుమీాదినుండి గుభాలున వీధిలోబడిరి. పోయి పొట్టి పొచికిని బరబరలాగి అరుగుపై గూలద్రోసి మరల దలుపుపై బాదితిని. తలుపు ఊడిపడిదినది. ఇంతలో ఇరుగుపొరుగు వారు పరుగెత్తుకొనివచ్చి కొంపలో ప్రవేశించిరి. బోండా అక్కా, పెండ్లామూ ఒకరినొకరు కౌగిలించుకొని రోదన మొనరించుచున్నారు. పిల్లలు ఎచ్చటి వారచ్చట గోలపెట్టుచున్నారు. "దొంగయేడీ?" అని వచ్చిన పెద్ద మనుష్యులు వారిన గి వారినొక దరిజేర్పదొడగిరి. కొందఱు దొడ్డివైపునకు పరుగులెత్తి

మూల మూలలను గలయజూడ దొడగిరి. ఇంతలో అరుగుపై పడిన బుడంకాయి "తేలు! తే"లని గోలపెట్ట సాగినాడు. చేతలాంతరుగాని ఒక పెద్దమనిషి అరుగును పరీక్షించినాడు; కుట్టినతేలు రొట్టలోదూరెనని యూహించి దానిని దిగువకు త్రోసినాడు.

ఈసమయమందే ఎట్లో బయల్వెడలి పాపము బుడంకాయిని తేలు కుట్టినందులకు దుఃఖించితిని. అపరిచితుడైన వికృతమానవు డొకడు ఆకస్మిక యాతనముపాల బడుట గాంచి ఒకరిద్దఱు పొరుగువారు తేలును చంపి, బుడంకాయను చేతులమీద వేసికొని ఎదుటి యరుగుమీదికి గొనిపోయిరి. పాపము అభాగుని తేలు తీవ్రముగ కుట్టియుండును. దుస్సహమైన బాధతో అతడు విలపించుచున్నాడు. భయములేదని వానికి ధైర్యము చెప్పి, బోండా గృహమున ప్రవేశించి విషయ మరయసాగితిని. ఇప్పటికి ఆడువారు కొంత తెప్పిరిలిరి. కనులుమూసికొని, అఱచుచు డగ్గుత్తికతో నేదో పలుకసాగిరి. దొంగగాని, పిశాచముకాని, పాముకాని, అడవిమృగముగాని మాకగపడలేదు. సరియగు ప్రత్యుత్తరమునా యాడువారివలన పడయనేరమైతిమి. ఇల్లంతయు వెతకుచుంటిమి. అడుగు ప్రక్క బడిపోయిన బోండాను కొలది నిముసములనుండి లేవదీయుటకై కొందఱు విశ్వ ప్రయత్నములు చేయుచుండిరి. స్వతస్సిద్ధముగా చాల బరువైన మనిషి! అందును పెనగులాటలో చివాలున వెలికిలబడినాడు! ఇంతలో లేవదలచుకొనక పడియే యున్నాడు! అతి కష్టమున ఆగంతువులు వానిని లేవందీసి అరుగుపై స్తంభముప్రక్క జేర్చిరి. ఒక పర్యాయము "దొంగ"ని, ఇంకొక పర్యాయము "దూడ"ని అతడు అఱువసాగినాడు. చీకటిలో తనకును, బుడంకాయికిని ద్వంద్వ యుద్ధము జరిగెనని ఆతడు గ్రహింపలేదని, ఏదియో దూడయో, ఎవండో దొంగయో తన్ను మార్కొనెననియే ఆత డూహించె ననియు గ్రహించితిని. ఆంతరంగికముగ "అమ్మయ్యా!" అనుకొంటిని. పరస్థలమున ఆతిథ్యమిచ్చిన పెద్దమనిషి! వీనిపట్ల నాటి యల్లరిలో నాయనుచరుడు బుడంకాయి ఆచరించిన విధమునకు దుఃఖావమానములతో ఆంతరంగికముగ దగ్ధమైపోతిని. కొంత అపచారము పొట్టి పిచికివలన జరిగెనని ఆతడుగాని మఱెవ్వరుగాని గ్రహింపజాలనందులకును, మాపరువునకు భంగము రానందులకును, సంతసించి ఈమాటయును ఆమాటయును చెప్పి, బోండాను కుదుటపఱిచితిని. మెల్లగ నాతడులేచి గద్గద స్వరముతో లోని యాడవారిచెంత చతికిలపడి మనుమరాలిని కౌగిలించుకొని విలపించినాడు. మరల గొంత సేపందఱు పెద్దపెట్టున నేడ్చిరి. "భయములేదు, ప్రాణములు దక్కినవి. ఎక్కడి పెట్టె లక్కడే యున్నవి. ఊరుకొను"డని పలుమాఱు చెప్పి ఎట్టకేలకు వారిని మేమూఱడింప జాలితిమి. అనంతరము నేను బుడంకాయియున్న చోటికిపోతిని. కాని పొంత గూర్చుని ఒకరు మంత్రము వేయుచున్నారు; ఇంకొకరు చికిత్స చేయుచున్నారు, ఒకరు సేవచేయు



మిస్. ఆనీ మాస్కరీన్

తిరువాంకూరు సంస్థాన కాంగ్రెసు సభ్యురాలు. ఆ సంస్థానమునందు స్వాతంత్ర్యోద్యమము ప్రారంభించి నప్పటినుండీ అమితోత్సాహంతో పాల్గొంటూవుండే వారు. అందుచేతనే ఇటీవల తిరువాంకూరునందు జరిగిన ఆందోళనా ప్రారంభములో దుర్మార్గులు వీరి ఇంటిని దోచుకొన్నారు. (దోపిడిని గురించిన వివరాలు జానుసంచికలో ఉన్నాయి.) ఆందోళన ప్రారంభమైనపుడు వీరు జైలునున్నారు కాబట్టి జైలు తప్పింది. వారిపుడు సంస్థానం ప్రవేశించగా రాజద్రోహపు ఉపన్యాసము లిచ్చారని వారిని అరెస్టుచేసి జామీనుమీదకూడా విడువకున్నది తిరువాంకూరు ప్రభుత్వము.



తాడేపల్లి గూడెం పతీహిత సమితివారి శారదాగ్రంథాలయ ఆరవ వార్షికోత్సవము
శ్రీమతి గంధం అమ్మన్నరాజా బి.ఎ. యల్.టి., ఎమ్. ఎల్.ఏ. వారి అధ్యక్షతను
జరుపబడిన సందర్భమున తీయబడిన ఛాయాపటము.

చున్నారు. కొంతసేపటికి రోదనముమాని బుడంకాయి లేచి కూర్చున్నాడు. తనకేమియు జరుగనట్లును, స్వప్నప్రపంచమునుండి అపుడే లేచివచ్చినట్లును ఆత డగపడినాడు. "అదేమి?" అని వాడెదుటి యుల్లరినిగుఱించి ప్రశ్నించినాడు. చికిత్స బలమో మంత్ర మహిమో పనిచేసినది. నిముసములో నాతడు బాగుపడినాడు. "ఎక్కడ కుట్టినదిరా తేలు? ఎంతవఱకు ఎక్కినది?" అని వానిని ప్రశ్నించితిని. జవాబులేదు. ఎక్కడ కుట్టి నదో వానికే తెలియలేదు! పెద్దమనుష్యులు చికిత్స ఎక్కడ చేసిరో పాపము! నాపుట్టి పిచ్చికిని నేను బాగుగ నెఱుగుదును. నిజముగ వీనిని తేలుకుట్టలేదని గ్రహించుకొంటిని. కాని కిక్కురుమనక, బోండా యింటిలో ప్రవేశించితిని. అల్లటి ఇప్పటికి చల్లారినది. పాపము బోండా అక్క మొగము కందిపోయినది. కొంతవఱకది గీఱుకొనిపోయినది! ఏలనో? "ఏమిజరిగెను అమ్మా!" అని అస్థూలకాయను ప్రశ్నించితిమి. మొగమును, అటకను జూపుచు "ఉఱికెను! నన్ను సగము తినెను" అని ఆమె విలపింపదొడగినది. ఉఱికిన దెవ్వరో? సగము తినిన దెవ్వరో? దీపపుబుడ్డి క్రింద బడియున్నది! ఇల్లు కలయ వెదుకగా మూలగదిలో క్రోధోన్మత్తములైన రెండుపిల్లు లగపడినవి. పెనగులాడుచు, అటకమీదినుండి ఆకస్మికముగ నవి నిదురించుచున్న బోండా, అక్క వదనారవిందముపై పడినవని, దీపముబుడ్డి మీదినుండి యవి దుమికిపోవుటచే అది దొరలిపోయినదని, తోడన చీకటిలో నీ మహాప్రళయము సృష్టియయ్యెనని గ్రహించితిమి.

## గానకళ

శ్రీ గాలిపెంచల నరసింహారావుగారు
మ్యూజికల్ డైరెక్టర్

నందీశ్వరి - ఆదితాళము

ఆరోహణ : స రి మ ద ని స | స రి మ ద ని స (గ)
అవరోహణ : స ని ద మ గ రి స | ,, చ శు చ కై ,, (సా)

22-వ మేళకర్తయగు "ఖరహరప్రియ" యందు జన్యము

ఔడవ షాడవము :

వ్రేలికి నాలుగుఅక్షరముల చొప్పున ఘాతనుండి మూడుఅక్షరములు క్రిందికాలము త్రోసి పాడుకొనవలయును.

పల్లవి. మనసా! వృథా - గరువమేలనే?
మహారాజైన - మనుజుండే గాదా॥ మనసా॥

అనుపల్లవి. మమత భేదరహిత - మానుష్యులైనవారి
మనసే సాక్షిగాని - మహిని వేరుకలదె॥ మనసా॥

చరణము. ధరణిలోన తాము - తనరియుండు వఱకే
తనయు లాప్తులను - తలచి కాన లేరు
మహిని వెతకిచూడ - మహిమ వేరు కలదే?
మదిని వెంకటేశు - స్మరణమొకటె గాక॥ మనసా॥

పల్లవి. , , , : సరిరిమా , ,, మా | రిమగరిసా సా | రీసనిదానీ
: మనసఆ , ,, వృ | ధఆఆఆఆ గ | ర్వ మేఎఏలా
సరిమాగరి : సరిమదనిస నిదమా | రిమగరిసా సా | రీసనిదానీ
మేఎఏఎఎ : మనసఆఆఆ ఆఆవృ | ధఆఆఆఆ గ | ర్వ మేఎఏలా
సరిమాగరి : రిమదనిసరి నిదమా | రిమగరిసా సా | రీసనిదానీ
మేఎఏఎఎ : మనసఆఆఆ ఆఆవృ | ధఆఆఆఆ గ | ర్వ మేఎఏలా
సరిమాగరి : రిమదనిసరి గరిసనిదామా | రిమగరిసా సా | రీసనిదానీ
మేఎఏఎఎ : మనసఆఆఆ ఆఆఆఆఆ వృ | ధఆఆఆఆ గ | ర్వ మేఎఏలా
సరిమాగరి : రిమ దనిసరి మగరిస నిదమా | రిమగరిసా సా | రీసనిదానీ
మేఎఏఎఎ : మనసఆఆఆ ఆఆఆఆఆఆవృ | ధఆఆఆఆ గ | ర్వ మేఎఏలా
సరిమాగరి : రిమదనిసరిమగగరి రిససనిదామా | రిమగరిసా సా | రీసనిదానీ
మేఎఏఎఎ : మనసఆఆఆఆఆఆఆఆఆఆఆఆవృ | ధఆఆఆఆ గ | ర్వ మేఎఏలా
సరిమాగరి : రీమా మాదాదా | నీ,దా,మద | నీదామాగా
మేఎఏఎఎ : మహారాఆజె | రైన్యా,మఆ | నూజాంండె
రీ,సా : రీమా దని సాసా | నిసనీదా మద | నీదామాగా
గా,దా, : మహారఆఆజె | రైంఇఈన మఆ | నూజాంండెఎ
రిగా,సా, : రీమా దనిసరిసరి | నిసనినిదా మద | నిసనిదమాగరి
గఆదా, : మహారఆఆఆజెఎ | రైంఇఇఇన మఆ | నుఊజాంండెఎ
రిగాసా, : రిమమా దనిసరిమగరిసరి | నిసనినిదా మద | మదనిసరిసనిదమగరి
గఆదా, : మఆహా రఆఆఆ ఆఆఆఆజెఎ | రైంఇఇఇన మఆ | నుఊఊఊజాంంంండెఎ
రిగాసా; : సరిరిమమద నిసనిదమా | రిమగరిసా సా | రీసనిదానీ
గఆదా, : మనసఆఆఆ ఆఆఆఆవృ | ధఆఆఆఆ గ | ర్వ మేఎఏలా
సరిమా,, :
మేఎఎ,, :

(మనసా వృథా గర్వమేలనే)

, , , : మమమా దనిసాసా | సససా ,, సా | రీసనిదానీ
మమత భేఎఏద | రహిత ,, మా | నుష్యులై ఇతఈన

| | | | |
|---|---|---|---|
| పా,పా, : | మమమా దనిసరిగరి | పసపా ,, సగ | , రిసనిదానీ |
| వా,రీ, : | మమత ఛేఎఎఎదఅ | రహిత ,, మఅ | న్యులై ఇతఉన |
| పా,పా, : | మమమా దనిసరిమగ | రిసపా ,, పస | గరిసనిదానీ |
| వా,రీ, : | మమత ఛేఎఎఎదఅ | రహిత ,, మఅ | అన్యులై ఇతఉన |
| పా,పా, : | మమమా దనిసరి మగగరిసారీ | పపపా ,, దనిసరి | మగరీరిసా, సనినిదదానీ |
| వా,రీ, : | మమత ఛేఎఎ ఎఎఎఎదఅ | రహిత ,, మఅఅఅ | అఅన్యులై ఈఇఇఇఇతఉన |
| పా,పా, : | ససపా నిసనీదా | దా,మా, మద | నీదామాగా |
| వా,రీ, : | మనసే పఅఅక్షి | గా,నీ, మహి | నీ శేఏరు |
| రిగాసా, : | పసపా నిసరీ నీ | దనీదా, మద | నిసనిదమాగా |
| కలాడే, : | మనసే పఅఅ క్షి | గఅనీ, మహి | నిఇవెఎఏరు |
| రిగాసా, : | ససపా దనిసరి మగరిస సారి | పనీదా, మద | మదనిరి సనిదమగరి |
| కలాడే, : | మనసే పఅఅఅఅఅఅక్షి ఈ | గఅనీ, మహి | నిఇఇఇ వెఎఎఎరుఉ |
| రిగాసా, : | | | |
| కలాడే, : | (మనసా వృథాగర్వమేలనే) | | |
| , , , : | మమమా దా ,, దా | దనీదా, మద | నీదా మాగరి |
| | ధరణీ లో ,, వ | తఅమా తవ | రీయుంచుఉ |
| రిగాసా, : | మమమా దనిసాసా | నిసనీదా మద | నిసనిదమగగరి |
| వరశే, : | ధరణిలోఒఓవ | తఅఅమా తవ | రిఇయుం౦౦డుఉ |
| రిగాసా, : | పగారి సనిదానీ | పపసా పరి | మామా ,, మా |
| వరశే, : | తనాయులఅఅ పు | లమచు తల | చికా ,, న |
| రిమగారీ, : | పగారి పనిదాదని | పపసా పరి | మా పరిమద నిదమ |
| శేఎఏరు : | తనయులఅఅ పుఉ | లమచూ తల | చీ కఅఅఅఅరిన |
| గరిమగరీ : | మమమా దనిసాసా | సా, సా, పగ | , రిసనిదానీ |
| శేఎఎఏరు : | మహిని వెఎతకి | చూ,డా, మహి | , మవెఏఏరు |
| పసాసా, : | మమమా దనిసరిగరి | సా,సా, సరి | మగరిసనిదనీ |
| కలడే, : | మహిని వెఎతఅకిఇ | చూ,డా, మహి | మఅ వెఎఎఎరు |
| పసాసా, : | పసపా నిసనీదా | దా,మా, మద | నీదామాగా |
| కలడే, : | మదిని వెం౦క | టే,శూ,స్మర | ణ వెంకటే |
| రిగాసా, : | ససపా నిసరీనీ | దనీదా, మద | నిసనిదమాగా |
| గఅక, : | మదిని వెం౦క | టెఏశు, స్మర | ణఅ వెంకటె |
| రిగాసా, : | | | |
| గఅక : | (మనసా వృథాగర్వమేలనే) | | |
| : | పరిమాగరిమదమ | దానిమదని దని | సానిదనిసరిస |
| గరిపమగరి : | పనిదనీ గరిసనిద | నిపానీ దనిస రి | పనిదమ పనిదమ |
| గనిదమగరి : | (మనసా వృథాగర్వమేలనే) | | |

# పుష్పచయము

## రెండుతలల మనిషి

మానవప్రపంచంలో ఒకమనిషిని పోలిన మనిషి ఇంకొకడువుండడు. వ్యక్తికీ వ్యక్తికీ మధ్య ఏదో భేదం వుండితీరుతుంది. ఇదే పెద్దవిచిత్ర మనుకుంటూన్న మానవులకు సృష్టిలో మరీవిచిత్రమైన సంఘటనలు గోచరిస్తుంటాయి. మన గంగమ్మ, గౌరమ్మ అనే కవల పిల్లల విషయం సృష్టిలో విచిత్రసంఘటనగాక మరే మిటి? ఇద్దరికీ వేరువేరు తలలు వేరువేరు చేతులు, వేరువేరు ఛాతులు; నడుంమాత్రం కలుసుకొనివుంటుంది. ఈ విపరీత సృష్టికి కారణం ఇంద్రియాణువు సక్రమంగా విచ్ఛిన్నం గాకపోవడమే నంటారు శాస్త్రజ్ఞులు. మన గంగమ్మ, గౌరమ్మలు ఇటీవల జరిగిన పారిస్ ప్రదర్శనంలోకూడా పాల్గొన్నారు. వారి విషయ మేమైందో, వారిమీద శాస్త్రజ్ఞులేమైనా పరిశోధనలు చేస్తున్నారో లేదో తెలియదుగాని, మాస్కోనుండి ఇదే విధముగా విపరీత కవల పిల్లలు ఒకరికొకరు కరుచుకొని పుట్టారని వార్త వస్తున్నది.

ఈ కవల పిల్లలు పుట్టి ఇప్పటికి సరిగా ఏడాదైందట! మాస్కోలోవున్న ఆల్ యూనియన్ ఇన్‌స్టిట్యూట్‌లో ఆ కవల పిల్లలమీద శారీరక శాస్త్రవేత్తలు పరిశోధనలు సాగిస్తున్నారు ప్రస్తుతం.



ఆ ఇద్దరిలో ఒక పిల్లపేరు ఇరినా, రెండో పిల్లపేరు గాలియానా. ఈవిధంగా ఒకరికొకరు కరుచుకొని పుట్టిన శిశువులు అట్టేకాలం జీవించరనీ, పుట్టగనే చచ్చిపోతారని అంటారు తెలిసినవారు. ఇరీనాకు, గాలియానాకు వేరేవేరే తలలూ, చేతులూ, రొమ్ములూ, వేరేవేరే పొట్టలూ, వున్నాయి. రక్తప్రవంతి మాత్రం ఇద్దరిలోనూ ఒకేవిధంగా వుంటుంది. పొత్తికడుపు, రహస్యంగాలూ మాత్రం వేరువేరుగా లేవు.

సోవియట్ రష్యా సుప్రసిద్ధ శారీరక శాస్త్రవేత్తలు జి. ఎన్. స్పెరన్‌స్కీ, పి. కే. అనోష్కిన్ అనే వారిద్దరూ ఆ కవల పిల్లలను పుట్టినప్పటినుంచీ జాగ్రతగా పరిశీలిస్తూవున్నారు. మొత్తంమీద పరిశోధనలవల్ల యేమి తేలింది అంటె ఆ కవల పిల్లలిద్దరికీ ఒకరి బాధ వాళ్ళదీ, ఒకరి ఆకలి వాళ్ళది అని. మొట్ట మొదట ఆ ఇద్దరిలో ఏ ఒకరికైనా బాధ కలుగజేస్తే రెండో పిల్ల ఫీలవుతుందా అని పరీక్షించిచూచారు. ఇరీనా కాలిమీద సూదితో పొడిచి చూచారు. ఇరీనా కెవ్వున కేక పెట్టింది. గాలియానా హాయిగా ఆడుకొంటూనే వుండిపోయింది. ఏ బాధైనప్పటికీ ఎప్పుడూ సెంట్రల్ నర్వస్ సిస్టములో ప్రారంభమవుతుం దన్న సిద్ధాంతాన్ని పై అంశం రుజువుచేస్తున్నది. సూది గుచ్చడంవల్ల ఇరీనా నర్వస్ సిస్టంమాత్రమే చలించిం

దన్న మాట. ఇకపోతే ఆకలివిషయం! ఈవిషయాన్ని పరిశోధించడానికి శాస్త్రజ్ఞులు ఇరీనాకు మాత్రమే ఆహారం పెట్టి గాలియానాకు మానేశారు. ఇరీనా హాయిగా నిద్రపోయింది. గాలియానా ఆకలి బాధకు తాళలేక గిలగిల్లాడింది. ఇంతకు పూర్వం ఆకలెందుకు వేస్తుందని ప్రశ్నిస్తే రక్తానికి ఆహారం కావలసివచ్చి నప్పుడల్లా ఆకలివేస్తుందని సిద్ధాంతీకరించేవారు పెద్దలు. అదంతా తప్పనీ కేవలం నర్వస్ సిస్టమే ఆకలికి కారణమనీ పైఅంశంవల్ల స్పష్టమవుతున్నది.

ఇక నిద్ర విషయం! కవల పిల్లలిద్దరూ ఏ పిల్లకు ఇష్టమొచ్చినప్పుడు ఆపిల్ల నిద్రపోతుంటే గాని, రెండో పిల్లతో వంతు లేనేలేదు. ఒక పిల్ల హాయిగా నిద్రపోతోంటే రెండో పిల్ల హాయిగా మేల్కొనే వుండవచ్చు. సుప్రసిద్ధ ఫ్రెంచి శారీర శాస్త్రజ్ఞుడు పీరాన్ శరీరంలో మత్తును కలిగించే విషపదార్థాలు చేరడం వల్లనే నిద్రవస్తుందనే ఒక సిద్ధాంతాన్ని కనిపెట్టి దానికి ప్రచారం చేశాడు. ఈ కవల పిల్లలమీద చేసిన పరిశోధనవల్ల ఆ సిద్ధాంతం తప్పని తేలిపోయింది.

రక్తంలో విషపదార్థాలు చేరడంవల్ల నిద్ర వచ్చేటట్లయితే ఒకే రక్తస్రావం కలిగిన ఈ ఇద్దరు కవల పిల్లలూ ఒకేసారి నిద్రపోవాలి కదా? ఎవరి ఇష్టమొచ్చినప్పుడువారు నిద్రపోవడం ఎలా సంభవిస్తుంది?

ప్రధానమైన మనో ప్రవృత్తుల విషయాన్ని గురించికూడా కొద్దిగా పరిశోధించారు. శరీరంలో నిరంతరం ప్రవహిస్తున్న కొన్ని రసాయనిక ద్రవ వాయుపదార్థాలవల్ల మానవుల మనోతత్వాలు ఏర్పడుతుంటాయని కొందరి వాదన.

అది తప్పని ఈ కవలపిల్లలవల్ల తేలిపోయింది. ఒకే శరీరాకరం, ప్రత్యక్షంగా ఒకే విధమైన రక్త ప్రవంతిగల ఈ ఇద్దరి కవలపిల్లల ప్రవృతులు వేరువేరుగా వున్నాయి. దానికి నిదర్శనంగా! ఇరీనా పెద్దగా కేకలువేస్తుంది. గాలియానా సాత్విక శిశువు; ఇరీనాకు చిరాకు, కోపం—గాలియానాది శాంతస్వభావం.

ఇవన్నీ చెప్పినప్పటికీ పాఠకులకు ఒక అనుమానం కలుగవచ్చు. ఒక పిల్లకు ఏదైనా జబ్బుచేసిందను కొండి—రెండో పిల్ల విషయమేమిటి?

గాలియానాకు తలమీద కురుపు ఒకటి లేసింది. ఆ కురుపు ఫలితం ఇరీనామీదా యే విధంగా పరిణమిస్తుందోనని పరిశోధకులు బహుజాగ్రతగా నిరీక్షించి చూశారు. చివరకు ఇరీనాకు కూడా తలమీదనే కురుపు లేసింది. ఒక పిల్లకు కొంచం జ్వరం తగిలితే రెండో పిల్లకుకూడా తగిలింది.

వైద్యశాస్త్రాభివృద్ధికి ఈ పరిశోధనలన్నీ ఎంతయినా సాయపడతవని శాస్త్రజ్ఞుల నమ్మకం.

—ప్రజాబంధు.

## అందరికీ సమ్మతమే

ప్రస్తుతము టీయొక్క గుణములు అందరకు తెలిసిన విషయమే. పూర్వకాలమున మన భారతీయులు కూడ టీ విలువ తెలిసికొనియుండిరి. 'సాల్గ్రామనిఘంటు భూషణ'మను వైద్యపుస్తకమందు, 'టీ శరీరమునందు ఉష్ణము కలిగించును. శీఘ్రకాలములో మేలనిపించును. ఆకలి కలిగించును. జీర్ణశక్తినిచ్చును. మైకము నివర్తిగావించును' అని ఉన్నది. ఆయుర్వేదమందు టీకి నాలుగు పేర్లుగలవు. పిలప్ మూరి, గిరిజిద్, ప్యామపిరని, ఆటనిద్రి.(?) 'టీ దగ్గును బాపును. చెమటను గలిగించును ఆకలి గలిగించి దేహమునకు శక్తినిచ్చును.'

ఈనాడు టీని మందుగా ఉపయోగించటములేదు. దినవ్యసనమయినది. ఆయుర్వేదము, ఆంగ్లశాస్త్రము పరికించినప్పుడు దీనిలో మేలుతప్పక యొనగూడును.

తీపుడు పానీయములనుగూర్చి తర్కించుచు డాక్టరు జి. రాచ్ లింగ్ చ్, లాన్ సెటులో "వైద్యశాస్త్రములో టీ, కాఫీ పీటిలోనుండే కాఫీన్ ఒంటికి చురుకుదనము నిచ్చుచున్నది. దానిని త్రాగువారు సదా చురుకుగాను కులాసాగానుందురు. మందమతులకు దీనిని మించినదిలేదు" అని వ్రాసినారు.

## పుష్పచయము

### స్త్రీలు చేయలేనివి!

‘పురుషుల్లాగా మేమూ చేయగలుగుతాం’అని స్త్రీలనుకునే పనులు చాలావున్నాయి—నిజంగా వారవి చేయగలిగేవుండాలి—అయితే ఏకారణంచేతనో వారు ఆపనులను చేయలేరు.

ఏ విషయములోనైనా పురుషునికి స్త్రీ వెనుకబడదని నిరూపించిన యీదినాల్లోనా యిలాంటి విపరీతపు మాటలు?—అంటే అదీనిజమే.

చూడండి. మనకంటే కూడా నిపుణంగాసూదిలో తమప్రవీణతను చూపుతారు పాశ్చాత్యస్త్రీలు. కాని వారిచేతికోక చాకుగాని పేనాకత్తిగాని ఇచ్చిచూడండి. ఆవిడ ఆఫీసుపని చేసుకుంటుంది. టైపురైటరును ఉపయోగిస్తుంది. అదులో రిబ్బను పోతేకూడ వేసుకుంటుంది. కాని పెన్సిళ్లను చెక్కమనండి. ఆవిడ దానికైపడేబాధ చూస్తే దుఃఖమువస్తుంది. అంతేగాదు, అసలాపెన్సిలే పనికిరాదు. క్రొత్తపెన్సిలు తీసుకరావాలసిందే. పైగా ఆవిడచేతికి బాండాజికట్టడానికి సామానుకూడా అత్యవసరం!

ఓ చిన్నపని— అసలదిపనేగాదు— ఏస్త్రీకైనా పత్రికనిచ్చి చదవమనండి. ఆవిడీస్వల్ప విషయాన్ని సరిగాచేయలేదు! ఇకఆపత్రికలోని పుటలన్నీ ‘ఎవరికివారై’ కుప్పగాపడి పోవలసిందేగాని మరిఆదిపత్రికగా వుండదు. ఇదేకారణం ఎన్నోవిడాకులకు.

బజారుకు వెళ్లి రావడమన్నా, సరుకులు కొనడమన్నా సరదాపడతారు, మాబాగాకొంటారని కూడా స్త్రీలకు పేరు. అయితే ఎంత చదువుకున్నవారైనా, ఏలాంటివారైనా, ప్రయాణానికి టికెట్టు కొనలేరు!

ఒకవేళ కొంటే— ఎంత గోల! ఎన్నిప్రశ్నలు, ఎన్ని సందేహాలు, ఎంతతొందర. ఆమెకు టిక్కట్టిచ్చి పంపించేలోపల ఆ ఆఫీసులోని ఉద్యోగులకు తలప్రాణం తోకకు వస్తుంది. ఈ బాధనుండి ఆ ఉద్యోగులను తప్పించడానికే మనిషి సహాయంలేకనే ఎక్కడికైనా టిక్కట్లు ఇచ్చే మిషన్లని పాశ్చాత్యదేశాల్లో ప్రవేశట్టడమంటే విచిత్రం గాదు.

ఇంకోటి. ప్రతి స్త్రీకూడా పాకకళ తెలిసిందే. అయితే సుప్రసిద్ధమైన పాకరహస్యాలు పురుషులకే తెలుసు!

స్త్రీ చేయలేని దింకోటి వుంది. ఏమంటే టెలిఫోనులో మాట్లాడడం తెలుసుగాని అది ఏలా ముగించడమో తెలియదు. అందుచేత ఎంతసేపైనా మాట్లాడుతూవుంటారు. వారి పని అయినా ‘సెలవు’ అని వారనలేరు. వారి నోటికది రాదు. ప్రక్కనున్నవారెవరైనా టెలిఫోను అందుకొని ఆ ముక్క అని ముగించినా వారికిష్టమే. సంతోషంకూడా!

ఆక్కడక్కడా మోటారుడ్రైవర్లు వైమానికులు వున్నారుగాని సాధారణంగా స్త్రీలకు యంత్రాలంటే సానుభూతిలేదు; ఇష్టమూ వుండదు.

సహజంగా సంగీతము అలవడే ప్రతిభవున్నా వారు గాయకులూ, గాయకుల కుపయోగపడే కీర్తనలను రచించేవారూ ఎప్పటికీ కారు. ఆ రంగంలో ఇప్పటికీ పాశ్చాత్య ప్రపంచంలో వారి ప్రత్యేకప్రతిభ చాటేదేమీలేదు.

దుస్తుల విషయంలోనూ ఇంతే. శిల్పులుగా, చిత్రకారిణులుగా తయారయారు కాని తమజాతికి కావలసిన దుస్తులలో నవీనత సృష్టించడములో వారు ముందుకు రాలేదు.

ఎంతో అభివృద్ధికి వచ్చిందన్న పాశ్చాత్య స్త్రీలోకమే ఇలావుంటే మన మెలా వున్నామో? దీనికంతా శతాబ్దాలనుండీ అనువంశికంగా వస్తూవున్న ఆచారాలూ వాడుకలు కొంతవరకు కారణం.—హిందు.

# గ్రంథసమీక్ష

### మాతృమందిరము (ప్రథమ, ద్వితీయ భాగములు)

'నవలారత్నమాల' ప్రథమరత్నము. రచయితలు సుప్రసిద్ధులు, శ్రీ వెంకటపార్వతీశ్వరకవులు. ప్రకటన కర్తలు ఆంధ్రప్రచారిణీ లిమిటెడ్ కంపెనీ, కాకినాడ. ప్రతిభాగము 12 అణాలు.

పాతికసంవత్సరాలకు పైగా ఆంధ్రుల మన్ననలను పొందుతూవుండే రచయితలనుగూర్చి కాని, వారి రచనలను గురించి కాని వ్రాయవలసిన నూతనాంశము లేమీ ఉండవు.

'మాతృమందిరము'నందలి కథ: స్వార్థపరులై నీతికి, నియమానికి, ధర్మానికి, న్యాయానికి దూరమై పరహింసల జేసిన పలువురు ప్రబోధానందుచేత, అతని శిష్యులచేత పశ్చాత్తప్తులై 'మాతృమందిర' భక్తులగుదురు. అధర్మమును ధర్మముచే బాగుచేయవలెననే ఉద్దేశం రచయితలది. ఆంధ్రమాత సైన్యకంతమున సేవింపవలసిన అవసరముగల నేడు ఇలాంటి గ్రంథాలు ఉత్సాహపూరితంగా వుంటాయి. కాని అందులోని సిద్ధాంతాలు ఇప్పటివారి కెంతవరకు నచ్చుతాయనేదే సందేహం.

### విశ్వనాథకవిరాజు వినోదనాటికలు

ప్రకాశకులు శ్రీ మల్లాది అవధాని, నాట్యభారతి, విజయనగరం. వెల రు. 0-8-0.

మనసంఘములోని కుళ్లునంతా-కుళ్లుకలవారు సహితం నొచ్చుకోనకుండా వుండు ధోరణిలో భావలో-నాటికలలో వెల్లడించి సంస్కారానికి ఉత్తమమార్గం చూపినవారు కవిరాజుగారు. వీరేది వ్రాసినా, అది ఎంతచురుకుగా దురాచారాలను తాకుతూవున్నా, ఆ హాస్యధోరణి చదువరులకు నవ్వుపుట్టిస్తుందేకాని కోపం లేదు. కుళ్లున్నవాడుకూడా చదువుకొని నవ్వుకొని సంస్కరించుకుంటాడు తనని. కావలసిం దీలాంటి రచనలే.

ఈ పుస్తకంలో 'పారెగడిలో', 'శ్రీరుగానుగ', 'దొంగాటకం', 'ప్రహ్లాద', 'అపశ్రుతి' అనే నాటికలున్నాయి. ఇవన్నీకూడా ఒకదాని కొకటి తీసిపోవు. అయితే వెండటిమాదూ, వాటిలో చివరిదీ అత్యుత్తమంగా కనిపిస్తాయి. ఇది ప్రతివారూ చదువవలసిన పుస్తకం, వినోదానికేకాదు లోకవిజ్ఞానానికికూడ.

### నవకవి

కర్త శ్రీ బుద్ధవరపు నాగరాజుగారు, వి. ఎం. ఆర్. ప్రెస్, పిఠాపురం, తూ. గో. వెల రు. 0-8-0.

రామం నవకవి—అంటే అభావాలచేత భ్రష్టుడైన యువకుడన్నమాట. మణిని ప్రేమిస్తాడు—ప్రేమించినట్టే అనుకొని ఆత్మవంచకుడవుతాడు. మణి తగినవరుని పెళ్లి చేసుకుని భర్తయింటికి వెళ్లిపోతుంది. అప్పటినుంచి రామం మణిని ప్రేయసినిగా ఎంచి, తన ప్రేమ విషాదమైనట్లు చెత్తకవిత్వం వ్రాస్తూ కుదకు మణిని కలిసికొని, ఆవిడకు తన ప్రేమను వెల్లడిస్తాడు. ఆ విడ రామాన్ని ప్రేమించినానంటుంది గాని రామం చెప్పినట్లు అతనితో కూడా రానంటుంది. రామం మణి భర్తతో చెప్పి ప్రేమించిన మణిని తీసుకొనిపోతానని ప్రగల్భాలాడుతూవుంటే మణిభర్త పరకువస్తాడు. రామం పిల్లి అవుతాడు. పరుకు సంగతి తెలిసికొని రామం ప్రేమను పరీక్షిస్తాడు. భయపడి రామం పారిపోతాడు. ఇది ఇందులోని కథ.

ఇది ఏకాంకిక. ఇందులో పాత్రలు ముచ్చరే. ప్రేమ అని కేవులాడే యువకప్రపంచంలోని ప్రేమ వ్యవహారాలని చూపించాలని రచయితగారి ఆశయం. ఇందులో రామం పాత్రమాత్రం ఆ వుద్దేశాన్ని నెరవేర్చింది. బాగా పోషింపబడింది. పాత్రలన్నీ అరుదైనవని విచిత్రమైనవనీ రచయితగారే అంటారు. అయినా మణి అసభ్యసంభాషణ ఆ రెండుగుణాలకుకూడా మించిపోయింది. చదువుతూవుంటే కథ సాఫీగా నడచినట్లు కనపడదు. చివర కథను రంగంమీద ముగించకుండా, తెరమరగున ముగించినవిధానం నూతనం. ప్రయత్నిస్తే మంచి నాటికలు వ్రాయగలరు రచయితలు.

### జోసెఫ్ స్టాలిన్ ఎమిల్ లిడ్విగ్గుల సంభాషణ

అనువాదకులు శ్రీ రాజ శివరామయ్యగారు,

ప్రకాశకులు శ్రీ గడ్డ లింగయ్యగారు, ఆదర్శగ్రంథ మండలి, ఎలమఱ్ఱు, కృష్ణాజిల్లా. వెల అణాన్నర.

ఎమిల్ లిడ్విగ్ సుప్రసిద్ధ జర్మను గ్రంథకర్త. అతను 1931-వ సంవత్సరములో స్టాలిన్ కలిసికొని సామ్యవాదముమీద రష్యామీదా సాధారణంగా వుండే సందేహాలనుగురించి అడిగినాడు. స్టాలిన్ చెప్పిన జవాబులు చాలా అపోహాలను పోగొడతాయి, సామ్యవాదాన్నిగురించీ, రష్య రాజ్యాంగవిధానాన్నిగురించీ.

## వకుళమాలిక

కవులు శ్రీ శివశంకరశాస్త్రిగారు. ప్రకాశకులు నవ్యసాహిత్య పరిషత్తు, గుంటూరు. వెల 8 అణాలు.

ఇందలి ఇతివృత్తమంతా ప్రేమనగర్ కీ రాహ్ కఠినహై అనే సూత్రంమీద ఆధారపడివుంది.

'ఇందిరాదేవి, వకుళమాలికనుగూర్చి హృదయవల్లభుని కంఠసీమ నలంకరించింది. ప్రియుడామెను అర్ధాంగిగా కోరాడు. ఆమె కంటికంటె కావలసిందేమి? ప్రియుడింటికివచ్చి హృదయేశ్వరిచ్చిన మాలను కేటికలో భద్రపరిచాడు. కొంతకాలానికి ఇందిరాదేవి ప్రియుని కంగుళీయకంగూడా ఇచ్చిందని వకుళమాలికకు ప్రియుడు చెప్పాడు. ఇందిరాదేవి తన గృహిణి అవుతుందని మురిసిపోతూవుండేవాడు.

కాలం గడిచిపోయింది. ఒకరోజు ప్రియుడు మాలికనుజూచి దుఃఖముతో ఇందిరాదేవి హృదయం మారిందని, అకస్మాత్తుగా ఆవిడహృదయం పాషాణమైందనీ చెప్పాడు. మరికొన్ని దినాలకు ఆమెను కలిసికొంటననీ ఆమెప్రేమ మారలేదు గాని వివాహాని కంగీకరించుట లేదనీ సోదరభావంతో చూస్తున్నానని చెప్పిందనీ విచారించాడు', అని వకుళమాలిక తనచరిత్రనూ, తనస్వామిచరిత్రనూ చెపుతుంది.

రచనంతా గీతాల్లోనే వుంది. వకుళమాలికలోని సౌందర్యమూ, సౌరభమూ, మార్దవమూ, ఆనందమూ చదివిచూచినవారికి గాని సులభంగా తెలియవు.

'అమృతతుల్యములైన
అతని వాక్కులు విన్న
ఆనంద ముప్పొంగునే
మాలికా,
అవశత్వమే కల్గునే.'

అని నాథునిగురించి ఇందిరాదేవి అన్నవాక్కు వకులమాలికకు చెల్లుతుంది.

'మైమరచిపోవాలి
మందమారుతములో
చొక్కిపోవలె నేడు
సూర్యకిరణాలలో
పండువెన్నెలలోన
పరవశము కావాలి!'

ఈ కోరిక ఎవరికున్నా సరే, వకుళమాలిక చదివితే చాలు.

# పత్రికాలోకము

## స్త్రీల వోటింగుహక్కు

ఇది బాపట్లస్త్రీ హితైషిణీ మండలి ప్రచురణములలో రెండో కరపత్రము. వోటింగు అక్కు అంటే ఏమో, అది స్త్రీ లెలా ఉపయోగించుకోవలెనో తెలుపుతుంది. ఈ కరపత్రాలను స్త్రీలకు పంచిపెట్టదలచుకునేవారు కార్యదర్శిగారికి పోస్టు బిళ్లలు పంపి తెప్పించుకోవచ్చును. 100 టికి 0 8 0, పోస్టు ఖర్చు అణా.

## అడ్వరుటైజరు

ఆంధ్రాంగ్లమాసపత్రిక. సంపాదకులు శ్రీనివాసరావుగారు, విజయనగరము. సంవత్సరపుచందా 8 అణాలు, విడిప్రతి అణా.

## వైద్యకళ

మాసపత్రిక. సంపాదకులు శ్రీ డాక్టరు చక్రవర్తుల నరసింహాచార్యులుగారు ఏ.ఆర్.ఏ.సి. బెజవాడ సం. చందా రూపాయి.

### విజయవాణి

అనంతపురమునుండి ప్రతి బుధవారము వెలువడు పత్రిక. సంపాదకులు శ్రీ వి. ఆత్మారామప్పగారు, డబులుక్రౌను ⅛ సైజున 12 పుటలు. సంవత్సరము చందా 3 రులు. విడిప్రతి అణా.

### విజ్ఞానం

రెండో సంపుటం మొదటి సంచిక అందుకొన్నాము. ఇందులోని ఆశీసులను బట్టిచూస్తే 'విజ్ఞానం' ఎంత అవశ్యకమైందో, విలువఅయిందో, దీని ప్రచారాన్ని రాష్ట్రవాసులు పరరాష్ట్రములందలి ప్రవీణులుకూడా ఎంతహర్షిస్తారో తెలుస్తుంది.

దేశభాషలో విజ్ఞానశాస్త్రాలని బోధించడానికి సాధ్యంగాదంటూవున్న విశ్వవిద్యాలయాలకు పాఠం చెబుతూ సాధారణంగా చదువను వ్రాయను నేర్చిన వారికి కూడా సులభంగా విశ్వవిజ్ఞానాన్ని బోధపరుస్తూవుంది 'విజ్ఞానం'. విజ్ఞానం అభివృద్ధిపొందుగాక ! ఈ కృషికి కారకులు శ్రీ కాశీపట్నపు కొండయ్యగారు రాజమండ్రి. 'విజ్ఞానం' సాలుచందా 3 రు. విడిప్రతి 12 అణాలు. సంవత్సరానికి ఆరుసంచికలు.

### నవశక్తి (రష్యాసంచిక)

ఇది ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టుపార్టీ పత్రిక. కార్యాలయం బెజవాడ. ఈ ప్రత్యేకసంచిక వెల నాలుగణాలు.

రష్యా రాజ్యాంగవిధానం ఏదోవిధంగా ప్రపంచాన్నంతా ఆకర్షిస్తూవుంది. తుదకు ప్రపంచకళ్యాణానికి కూడా దానిదారే మంచి దోవవుతుందేమో అనికూడా అనిపిస్తుంది. అయితే సామ్రాజ్యవాదాలచేత, నియంతృత్వాలచేత ఊగింపబడుతూవుండే రాజ్యాలలో రష్యాఅంటే మంటగానే వుంటూవుంది. అయినా ప్రజాసముదాయానికి రష్యానుగూర్చిన వివరాలు తెలిసికోవాలని ఉత్సాహంఉంది. కాని మార్గాలు చాలావఱకు అరికట్టబడి వున్నాయి.

రష్యా సంగతులను ప్రకటించటానికి 'నవశక్తి' ప్రత్యేకశ్రద్ధ వహిస్తూవుంది. ఈ ప్రత్యేక సంచికలో రష్యానుగురించిన, రాజకీయ, సాంఘిక, ఆర్థిక, సారస్వత విషయాలు విద్యాధికులచేత వ్రాయబడ్డవి. వాటితోకూడా 16 చిత్రపటాలు-రష్యా వివరాలు తెలిపేవి-ఉన్నాయి. రష్యానుగురించి తెలిసికొనదలచుకొనేవారంతా యీ ప్రత్యేక సంచికను చదువాలి.


## జ్వరం వ్యాపారుల వ్యవహారాన్నే చెడుస్తుంది

బాంద్రానుండి మిస్టర్ ఎ. వి. రావు అనే వ్యాపారి ఇలావ్రాస్తున్నారు. "కంట్రాక్టు తీసుకోడానికి ఇక మూడు వారాలేవుంది. అప్పుడు జ్వరం ప్రారంభించింది. క్రమంగా నిమ్మళించినా వ్యాపారంలో దిగడానికి నాకు భయంవేసింది. తిండి దిగదు; దోకులు ; బరువు తగ్గిపోయింది. అపుడు డాక్టరు హార్లిక్సు సిఫార్సుచేశాడు. కలిగిన మార్పుమాత్రం అద్భుతం. నాకు తిరిగి బలంవచ్చింది. జ్వరంచేత బలహీనత మాయమైంది. గడువు ముగించడానికి రెండు దినాలు ముందుగానే కంట్రాక్టు తీసుకున్నాను. నా వ్యాపారం నాకు దక్కింది; హార్లిక్సుకు కృతజ్ఞుణ్ణి."

మిస్టర్ ఎం. వి. రావు, బాంద్రా.

నేడే హార్లిక్సు కొనండి—అంతటా దొరుకుతుంది.




## కెమాల్ అస్తమయము

టర్కీ అధ్యక్షుడు, ముస్తాఫా కెమాల్ పాషా నవంబరు 10-వ తే ఉదయము అస్తమించినాడు. ప్రాచ్యదేశాలన్నింటిలోనూ ఆతని అస్తమయానికి అమితంగా విచారాన్ని సూచిస్తూ సమావేశాలు జరిపినారు, మహమ్మదీయులూ, తదితరమతాలు వారు కూడాను.

టర్కీ ఆసియాఖండములోని ఒకగొప్ప దేశానికీ సరిరాదు; కెమాల్ నియంతలలోనే లెక్క; కాగా అతని మృతి కంత వగపెందుకు? అతని సంతగా పొగడడము దేనికి?

పైవి రెండూ నిజమైనా ఆశియాఖండానికంతా కెమాల్ అద్భుతమైన పాఠాలు నేర్పినాడు; ఆదర్శాన్ని చూపించినాడు.

టర్కీ 1922, నవంబరు మొదటి తేదీ వఱకు సుల్తానుల ఆధిపత్యములో ఉండేది.

ఈ దేశములో కొంతభాగము యూరపులో చేరివున్నా ఇది ప్రాచ్యఖండములో చేరిందే—ఈమాట ఎందుకు వ్రాస్తామంటే ప్రాచ్యఖండములోని దురదృష్ట దేశాల లాగే రాజకీయ, ఆర్థిక, సాంఘిక స్థితులలో టర్కీ అధోలోకములో వుండేది. ప్రజలన్నివిధాలా బాధపడేవారు; పరిపాలకులన్నివిధాలా వారిని బాధపెట్టేవారు. పాశ్చాత్యులు ఎపుడీ దేశాన్ని కబళిస్తామా అని ఎన్ని ఎత్తులైనా ఎత్తేవారు.

ఈ స్థితిలోవుంది టర్కీ; అపుడు అధికారము స్వీకరించినాడు కెమాల్.

1923 అక్టోబరు 29 వ తేది టర్కీ ప్రజాప్రభుత్వమైంది; కెమాల్ అధ్యక్షుడైనాడు. తన అధికారం క్రింద టర్కీ ఉన్నది 15 సంవత్సరాలే. అయితే ఏమి! ప్రపంచమంతా మెచ్చుకొనదగి నంతమార్పు!! టర్కీకి పాశ్చాత్య ప్రపంచాన్ని ధిక్కరించి నిలువ గలిగిన శక్తి; అంతర్జాతీయ గౌరవము!!!

అధికారాన్ని స్వీకరించిన వెంటనే దేశోద్ధరణకు పూనుకున్నాడు కెమాల్. తాను చేసినవి రెండు:

మొదట దేశాభివృద్ధికి ఆటంకముగానున్న పూర్వపద్ధతుల నన్నింటినీ అరికట్టినాడు; శాసనాలు చేయించి వాటికి శాస్తి చేయించినాడు. జాతీయతనే అంధకారములో ఉంచుతూవున్న ఘోషాపద్ధతి మాయమయింది. అందరికీ విద్య అందుబాటులోనికి వచ్చింది. పురుషునితో సమానముగా సంఘములో సంచరించడానికి స్త్రీలకు హక్కులు కలిగినవి. స్త్రీల అభ్యుదయాని కడ్డుతగులుతూవున్న ఆచారాలన్నీ అంతరించాయి. అంతేగాదు. పురుషులతో సమాన

ముగా స్త్రీ లే వుద్యోగమైనా చేయవచ్చు; వారి కట్టి అవకాశాలు కలిగినవి.

తరువాత దేశాభివృద్ధికై పాశ్చాత్య పద్ధతుల ననుకరించడము. పరిపాలనా పద్ధతులలో, పరిశ్రమాభివృద్ధిలో, భాషలో, భావాలలోకూడా పాశ్చాత్యుల ననుకరించి నాడు కెమాల్.

ఫలిత మేమయిందో నేటి టర్కీ నడిగితే చెపుతుంది.

ఇరువది సంవత్సరాలక్రింద 'యూరపు రోగిగా'నున్న యీటర్కీ ఇపుడు రోగాన్ని పోగొట్టుకొని చక్కని ఆరోగ్యం చేకూర్చుకొని, శత్రువులను ఎదుర్కొనే శక్తి సంపాదించుకొని, వేషంలో, భాషలో, ఆచార వ్యవహారాలలో పాశ్చాత్యులకు తీసిపోకుండా ధీమాగా తయారైంది.

కెమాల్ ఇలాంటి ఆశియారోగుల కద్భుతమైన పాఠము నేర్పినాడు. ప్రతి ప్రాచ్యదేశమూ టర్కీవలెనే అభివృద్ధిచెంది పాశ్చాత్య ప్రాబల్యాన్ని పారదోలవచ్చునని ఘంటాపథంగా చాటినాడు.

ఆ అద్భుతవీరత్వము, నిర్మాణకౌశలము, అసమానమైన ప్రతిభ, దేశభక్తి, స్వాతంత్ర్యపిపాస, స్వార్థత్యాగము, అకుంఠితసేవాశక్తి వున్న కెమాలులు బైలుదేరితే తూర్పుఖండంకూడా తేజరిల్లిపోతుందని అంటాము.

ఆంధ్రరాష్ట్ర మహిళాసభ

నవంబరు 12, 13వ తేదీలలో రాజమహేంద్రవరములో శ్రీమతి రాచేలు దేవదాసజ బి.ఎ. గారి అధ్యక్షతక్రింద పదమూడవ ఆంధ్రరాష్ట్రీయ మహిళాసభ జరిగినది.

అధ్యక్షోపన్యాసమున శ్రీమతి రాచేలు రెండు ముఖ్యవిషయాలను వెల్లడించిరి; స్త్రీకి భగవంతు డనుగ్రహించిన స్థానము: సంతానమును చక్కదిద్దవలసిన విధి.

స్త్రీ గృహిణిగా తన విద్యుక్తధర్మమును విచక్షణతో నిర్వహిస్తూవుంటే ఆమెదే వుత్తమమైన దేశసేవ; తరువాత ఆమె ప్రత్యేకముగా సంఘాభివృద్ధికని ఉపన్యాస వేదికలు ఎక్కవలసిన పని లేదన్నారు అధ్యక్షులు.

ఇది సత్యేతరము కాదు—అయితే స్త్రీలను నాల్గుగోడల మధ్యనే బంధించవలెనని అభిప్రాయ మిందులోవుందని భ్రమపడకూడదు.

ప్రతి ఇల్లూ చక్కబడితే సంఘమూ దేశమూ చక్కబడినట్లే. అదెలా సాధ్యమవుతుంది? గృహిణి వివేకముతో గృహిణీత్వాన్ని నడపుకొంటూ భావిపౌరులు కాబోతూవుండే తన సంతానాన్ని ఉన్నతాశయాలతో పెంచితే అది సాధ్యమవుతుంది. ఈ వివేకము కావాలంటే స్త్రీలకు ప్రత్యేకశిక్షణ, విద్య వుండవలెను. ఇపుడు కళాశాల లేవీ ఇలాంటి స్త్రీలను తయారు చేయడములేదు.

అందుచేత బాలబాలికల విద్యావిధానమే మారవలెనుగాని స్త్రీలకు ప్రత్యేక కళాశాల ఉన్నంతమాత్రాన వారి స్థితి బాగుపడబోదు.

అధ్యక్షులు గమనించమన్న రెండో విషయము పిల్లలనుగూర్చిన అశ్రద్ధ. చాల వఱకు స్త్రీలు తమ భర్తలకు జూపునంత శ్రద్ధాప్రేమలు పిల్లలపైన జూపుటలేదు. అందుచేత వారికి శారీరిక మానసికారోగ్యము కొరవడి సంఘాభివృద్ధికి తోడ్పడ లేకుండా ఉన్నారు. బిడ్డలకు బాల్యము నుండి ఇరవై సంవత్సరాలు పైబడేవరకు నియమజీవితము, ఉన్నతభావాలు, చక్కని వాడుకలు విద్యతోటి చెప్పింపగలిగితే యీ సంఘములోని కుళ్లు ఎంతోకాలము ప్రాణముతో ఉండదు. ఈ ఆశయాన్ని గృహిణులంతా మననము చేస్తారనే ఆశిస్తాము.

ఈ సమావేశము చాలా తీర్మానాలను చేసింది. వానిలో విద్యనుగురించి చేసిన తీర్మానా లెక్కువ. బాలబాలికల కొకే బడి ఉండవలెననీ, అందులో స్త్రీలే ఉపాధ్యాయినులుగా నుండవలెననీ చేసిన తీర్మానాన్ని ప్రభుత్వము గమనిస్తుందనుకుంటాము. పట్టణాలలోనా పల్లెలలోనా చర్చావకన విద్యాసంస్థల నేర్పరచి స్త్రీలు విద్యను ప్రోత్సహించవలసినదిగాగూడా తీర్మానించినారు. దానికి తగినకృషి చేయువారు మాత్రము కనపడరు. విద్యావతులు పూనుకొనవలెను.

హిందీభాషావిషయములో యీ సమావేశము చేసినతీర్మానము ఉపయోగకరమనుటకు కష్టము. హిందీభాష ఐచ్ఛికమే అయితే ఆ భాషావ్యాపకోద్దేశము ఎంతమాత్రము నెరవేరదని వారు గ్రహింపక ఉండరు.

పదమూడు సంవత్సరములనుండీ ఆంధ్ర మహిళాసభలు జరుగుతున్నా మహిళోద్యమము పట్టణాలను విడిచి బైటకు వెళ్లినట్లు లేదు. ఇటీవల కృష్ణాజిల్లాయందు కొంతవఱకు వ్యాపించినట్లు కనపడుతుంది. అంతే. ఇపుడీ సభ శ్రీమతి ఎస్. సుభద్రమ్మ గారిని మహిళోద్యమ వ్యాపకానికై నిర్మాణ కార్యదర్శినిగా నియమించినది. వీరీ యుద్యమము ప్రతియూరికి వ్యాపించునట్లు చేయగలిగితేనే సభాశయము సఫలమౌతుంది.

అఖిలభారతదేశమునందు వలెనే ఆంధ్ర ఆంధ్రమహిళాసభ వార్ధా విద్యావిధానాన్ని అంగీకరించింది. అంతేగాకుండా వెంటనే దాని నమలులో పెట్టమనికూడా కోరింది.

సాంఘికాభివృద్ధిని గోరి, రాష్ట్రీయ, కేంద్రశాసనసభలందు ప్రవేశపెట్టబడుచున్న చట్టములకు వీరు సుముఖులుగ నున్నారు. వరశుల్కము, వృద్ధులు బాలికలను వివాహమాడుట వీరు నిరసించుచున్నారు. వీటివలన ఎక్కువఫలితము కలుగవలెనంటే సమావేశమునకు వచ్చినవారందరు, అచట తమ సంఘాభివృద్ధికరములని తీర్మానించిన విషయాల నన్నింటినీ, తమవెంట తీసికొని వెళ్లి సోదరీమణులలో వ్యాపకము చేయవలెను.

ఆంధ్రరాష్ట్ర సంపాదనావిషయము వీరు మరువలేదు. నిరుత్సాహపడక దౌర్జన్యరహితమైన తీవ్రాందోళనము చేసి కృతకృత్యులగువఱకు నిదురపోగూడదని ఆంధ్రలోకాన్ని యీసమావేశము హెచ్చరించింది.

EDITED BY DR, K.N. KESARI, PRINTED AND PUBLISHED BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.

క. భూమిని నాకమునంగల
భూమంబగు నందమెదట బూచిన యటులన్
కోమలమై కనపడదో క
శామనాతంబైన లాస్య లక్షణమందున్.